శ్రీ గణాధిపతయే నమః|

# మహాశక్తి పీఠాలు

## అష్టాదశ శక్తిపీఠాలు - 52 ఉపశక్తి పీఠాలు



సంకలనం

లక్ష్మీగణపతి శాస్త్రి

శ్రీ చక్ర 'ఇ' పబ్లిషర్స్

## ఉపోద్ఘాతం

మన పవిత్ర భారతదేశం ఎన్నో దివ్యక్షేత్రాలకి పుణ్యతీర్థాలకి నిలయం. ఈ దివ్యభూమిలో ఎందరో దేవతలు తమ తమ అంశలని నిలిపి, ఈ ధరిత్రిని పవిత్రం చేసారు. మన దేశంలో వివిధ దేవతలకి సంబంధించిన వివిధ పుణ్యక్షేత్రాలు వున్నాయి. అయితే వీటిలో శక్తి ప్రధాన క్షేత్రాలుగా అష్టాదశ శక్తిపీతాలు. 52 ఉపశక్తి పీఠాలు. 108 శక్తి పీఠాలు ఎంతో విశిష్టతను సంతరించుకున్నాయి.

సృష్టి స్థితి లయకారిణి అయిన ఆ ఆదిపరాశక్తి అంశలు ఈ శక్తిపీఠాల్లో కొలువుండటం వల్ల వీటి మహత్యం ఎంతో గొప్పదిగా పురాణాలు చెబుతాయి. ఈ మహాశక్తిపీఠాలలో అత్యంత ప్రధానమైనవి అష్టాదశ శక్తి పీఠాలు. పూర్వం దక్షయజ్ఞ సమయంలో తండ్రి చేత అవమానించబడ్డ పార్వతీదేవి యోగాగ్ని ద్వారా తన శరీరాన్ని త్యజించగా, దేవి శరీరాన్ని భుజంపై వేసుకున్న శివుడు ఉన్మత్తుడై ప్రళయతాండవం చేయసాగాడు. అప్పుడు విష్ణుమూర్తి దేవి శరీరాన్ని తన సుదర్శన చక్రంతో ఖండించగా ఆ శరీరం నుంచి వెలువడిన భాగాలు భూమిమీద వివిధ ప్రాంతాలలో పడ్డాయి. అలా పడిన ప్రదేశాలలో సతీదేవి శరీరంలోని ముఖ్యమైన

భాగాలు పడిన ప్రాంతాలు అష్టాదశ శక్తిపీఠాలుగా విఖ్యాతి పొందగా, మిగిలిన భాగాలుపడిన ప్రదేశాలు 52 శక్తి పీఠాలుగా, 108 శక్తి క్షేత్రాలుగా సుప్రసిద్ధమయ్యాయి.

ఈ అష్టాదశ శక్తిపీఠాలు, 52 శక్తిపీఠాలు, 108 శక్తిపీఠాల ప్రాంతాల్ని నిర్ణయించే విషయంలో పండితుల మధ్య ఎన్నో భేదాభిప్రాయాలున్నాయి. అయితే చాలామంది అంగీకరించిన ప్రాంతాల్ని ఈ గ్రంథంలో పొందుపరిచాం. వీటితో పాటు, 51 శక్తిపీఠాల స్థానాలని 108 శక్తిపీఠాల అధిష్టాన దేవతల పేర్లతో మత్స్యపురాణంలో చెప్పబడిన అష్టోత్తర శతనామావళిని శ్రీ లలితాసహస్రనామ స్తోత్రాన్ని కూడా ఇదే గ్రంథంలో మీకందిస్తున్నాం...

మహాశక్తి ఉపాసకులందరినీ ఈ గ్రంథం అలరిస్తుందని ఆశిస్తూ నమస్కారాలతో..

**- లక్ష్మీ గణపతి శాస్త్రి**

## అష్టాదశ శక్తిపీఠస్తోత్రం

**లంకాయాం శాంకరీదేవి - కామాక్షీ కాంచికాపురే**

**ప్రద్యుమ్నే శృంఖలాదేవీ - చాముండా క్రౌంచ పట్టణే ||**

**అలంపురే జోగులాంబా - శ్రీశైలే భ్రమరాంబికా**

కొల్హాపురే మహాలక్ష్మీ - మాహుర్యే ఏకవీరికా ||

ఉజ్జయిన్యాం మహాకాళీ - పీఠికాయాం పురుహూతికా

ఓఢ్యాణే గిరిజాదేవీ - మాణిక్యా దక్ష వాటికే ||

హరిక్షేత్రే కామరూపా - ప్రయాగే మాధవేశ్వరీ

జ్వాలాయాం వైష్ణవీదేవీ - గయా మాంగల్యగౌరికా |

వారణాస్యాం విశాలాక్షీ - కాశ్మీరీ ఘు సరస్వతీ |

ఫలశృతి:

అష్టాదశ సు పీఠపు - యోగవిద్ధ్యాన నిర్మితమ్

తాసాం స్మరణ మాత్రేణ - మృత్యు దారిద్ర్య నాశనమ్ ||

సాయంకాలే పఠేన్నిత్యం - సర్వశత్రు వినాశనమ్

సర్వవ్యాధి హరం ఆరోగ్యం - సర్వసంపత్కరం శుభమ్

శక్తి పీఠాల ఆవిర్భావం

శివపురాణం మనకి శక్తి పీఠాల పుట్టుక, నేపథ్యం గురించిన వివరాలను తెలియజేస్తుంది.

సృష్ట్యాదిలో బ్రహ్మ తొమ్మిదిమంది ప్రజాపతులను సృష్టించాడు. వీరిలో ఒకడు దక్షప్రజాపతి. ఇతనికి ఐదుగురు పుత్రులు, యాభైమంది పుత్రికలు వారిలో సతీదేవి (దాక్షాయణి) జ్యేష్ఠ పుత్రిక.

ఈమెను పరమశివుడు దక్షుని అభిమతాన్ని తిరస్కరించి వివాహం చేసుకున్నాడు. ఒకసారి దక్షుడు మహాయజ్ఞాన్ని ప్రారంభించి దేవతలందరినీ ఆహ్వానించాడు. యజ్ఞం ప్రారంభించడానికి ముందు దక్షుడు యాగశాలకు వచ్చినప్పుడు శివుడు తప్ప దేవతలందరూ లేచి స్వాగతం పలికారు.

శివుడు లేచి నిలబడకపోవటంతో దక్షుడు తనకు అవమానం జరిగిందని భావించాడు. ఆ పగను తీర్చుకునేందుకు మరొక పెద్ద యాగాన్ని ప్రారంభించి సతీదేవిని తప్ప తక్కిన కుమార్తెలను, అల్లుళ్ళను, దేవతలందరినీ. ఋషులను, మునులను కూడా ఆహ్వానించాడు.

ఆహ్వానం అందకపోయినా తండ్రిపట్ల ఉన్న ప్రేమతో యాగానికి వెళ్ళటానికి నిశ్చయించుకున్నది సతీదేవి. శివుడు మొదట ఆమెను వెళ్ళవద్దన్నాడు. తర్వాత ఆమె కోరికకు సమ్మతించాడు.

అహ్వానం లేనప్పటికి విచ్చేసిన కూమార్తెను చూసి, దక్షుడు ఆమెను, పరమశివుడ్ని నిందించాడు. పతినింద సహించని సతీదేవి యజ్ఞకుండంలోకి దూకి అత్మాహుతి

చేసుకుంది. భార్య వియోగాన్ని సహించని శివుడు క్రోధారుణనేత్రుడై తన సేనకుడైన వీరభద్రుని పిలిచి యజ్ఞభంగం చేయమని ఆదేశించాడు.

వీరభద్రుడు యాగశాలకు వచ్చి, అక్కడకు విచ్చేసిన రాజులందరినీ హతమార్చాడు. శివుడు స్వయంగా దక్షుని వధించాడు. తర్వాత దేవతల విన్నపాన్ని మన్నించి, దక్షుని తలకు బదులు మేక తలను ఉంచి ప్రాణ బిక్ష పెట్టాడు. తర్వాత సతీదేవి పార్థివదేహన్ని భుజంపై మోసుకొని రుద్రతాండవం చేయసాగాడు.

ఆ తాండవానికి భూమండలం అల్లకల్లోలమైంది. జనులు, జంతుజాలాలు నలిగిపోయాయి. చింతాక్రాంతులైన దేవతలు శ్రీ మహావిష్ణువును ఆశ్రయించారు. సతీదేవి పార్థివదేహాన్ని, శివుని భుజం నుండి వేరుచేసే ఉద్దేశంతో విష్ణువు ఆమె దేహన్ని తన చక్రంతో ఖండించి పలుచోట్ల విసిరివేశాడు. విష్ణువు విసిరివేసిన దేవి యొక్క శరీర భాగాలు పడిన ప్రదేశాలు శక్తిపీఠాలుగా పేరుగాంచినాయి. ఈ స్థలాల్లో దేవి వెలసింది.

అలా వెలసిన దేవి నేటికీ భక్తుల కోర్కెలను తీరుస్తున్నదని విశ్వసిస్తారు. అందువల్ల ఈ స్థలాలను శక్తి పీఠాలంటున్నారు.

సాధారణంగా శక్తి పీఠాలను గుర్తించటానికి సంకేతంగా కొన్ని విశిష్ట అంశాలు ఉన్నాయి. మొదటి ఆ స్థలంలో దేవియొక్క దేహభాగం ఒకటైనా పడినట్లు ఉల్లేఖనం ఉండాలి. రెండవది అక్కడ స్త్రీ లేదా దుర్గా రూపదేవికి వామాచార లేదా దక్షిణాచార పద్ధతిలో పూజ జరుగుతూవుండాలి. ఇటువంటి దేవాలయాలను శక్తి పీఠాలుగా పరిగణించవచ్చు.

కొందరు 108 శక్తి పీఠాలన్నారు. 'శివచరిత్ర ననుసరించి 52 శక్తిపీఠాలే కాక 26 ఉపమహాపీఠాలున్నాయి. బెంగాలులో "నిశుద్ధ సిద్ధాంతపంకజ" పురాణంలో కూడా 52 శక్తిపీఠాలు పేర్కొనబడినాయి. కొన్నిచోట్ల 51 శక్తిపీఠాలు పేర్కొనబడ్డాయి.

శివపురాణం ప్రకారం ప్రధానంగా శక్తి పీఠాలు నాలుగు. వీటిని ఖండపీఠాలంటారు.

**ముఖఖండం :**

దక్షిణలో కాళికా ఇప్పటి దేవత. ఈ స్థలం పశ్చిమబెంగాల్ లోని కోల్ కత్తాలో వుంది.

**స్తనఖండం :**

బిరజా లేదా తారా తారణి ఇప్పటి దేవత. ఈ స్థలం ఒరిస్సాలోని బెర్హంపూర్ సమీపంలో వుంది.

**పాదఖండం : విమలాదేవి ఇప్పటి దేవత. ఈ ఖండం ఒరిస్సాలోని పూరి జగన్నాథాలయంలో ఉంది.**

**శక్తిపూజ ప్రారంభం**

మన భారతదేశంలో శక్తిపూజ హిందూధర్మంలాగా ఎంతో పురాతనమైంది. సింధూనాగరికత కాలంలో కూడా మహిళా ప్రధానమైన సమాజం ఉండేది. ఆమెకు ఒక ఉన్నతమైన స్థానం ఉండేది. ఈ గౌరవమే శక్తిపూజకు నాందీవాచకం పలికింది దీనికి సంబంధించి ఎన్నో చారిత్రక ఆధారాలు కనిపిస్తాయి.

అలహాబాదు వద్ద జరిపిన త్రవ్వకాలలో దొరికిన స్త్రీ విగ్రహాన్ని కార్బన్ డేటింగ్ పరిశీలన ద్వారా, సుమారు ఇరవైవేల ఏళ్ళనాటి విగ్రహమని పరిశోధకులన్నారు. ఉత్తరప్రదేశ్ లోని మీర్జాపురం వద్ద కొన్ని త్రికోణాత్మక రంగురాళ్ళు లభించాయి. అవి యోనిపూజకు సంబంధించినవని శాస్త్రవేత్తల అభిప్రాయం. ఇవి శక్తిపూజకు ప్రథమ సంకేతాలుగా భావించబడ్డాయి.

తర్వాత హరప్పా, మొహంజోదార్ నాగరికత కాలంలో స్త్రీ ప్రధాన సమాజం ఉండేది. ఈ నాగరికతకు సంబంధించిన శిల్పం ఒకటి ఇప్పుడు ప్యారిస్ వస్తు సంగ్రహాలయంలో ఉంది. ఇది దాదాపు మూడు వేల సంవత్సరాల నాటిది అని చారిత్రకుల భావన.

నాడు సమాజంలో స్త్రీకి ఉన్నటువంటి స్థానం అత్యున్నతమైనది. ఆమెను ప్రకృతి, శక్తి, జగన్మాత అని పూజించేవారు. స్త్రీకి మహత్తరస్థానం ఉంది అనటానికి ‘‘సప్తమాతృకలే’’ సాక్ష్యంగా ఉన్నారు.

**మహా శక్తి పీఠాలు**

శివతత్త్వంలో అవిభాజ్యంగా వెలుగుతున్న క్రియా చైతన్యరూపిణి సృష్టిస్థితిలయ ప్రక్రియల అధిష్ఠాత్రి దుర్మ పార్వతి, గౌరి, శ్రీలలిత, దాక్షాయణి కాళీ, అన్నరూపాలతో

వర్ణింపబడుతున్న దేవత ఆదిపరాశక్తి భారతీయ సనాతన ఆరాధన పరంపరలో శైవ, వైష్ణవ గాణాపత్య మార్గాలలాగా శాక్తేయమార్గం కూడా ఎంతో ప్రాచీనమైనది.

శక్తిపీఠం అంటే ఆమె ఆరాధనను తరతరాలుగా వెరవేనేస్తున్న ప్రత్యేకతలు కలిగి పౌరాణిక జానపద ఐతిహ్యాంతో అవృతమైన శాఖలు భారతదేశంలోనే కాక విదేశాలలో కూడా అర్చన. ప్రార్ధనాదులచే అనుగ్రహం అందజేస్తున్నాయి.

భారతదేశంలోని హిందూ దేవతాపురుషుల్లా స్త్రీ దేవతలూ కూడా పూజలందుకుంటున్నారు. "యత్ర నార్యస్తు పూజ్యంతే రమంతే తత్ర దేవతా!" అంటూ స్త్రీకి ఉన్నతస్థానమిచ్చి గౌరవించారు. స్త్రీ దేవతల పూజా ప్రక్రియ వేలాది సంవత్సరాల క్రితమే ప్రారంభమైంది.

శక్తి పూజావిధానం శక్తి పీఠాల ప్రసక్తి కూడా ప్రాచీనమైంది. ఈ శక్తి పీఠాలను గుర్తించటానికి ఎటువంటి ఐతిహసిక ఆధారాలులేవు. పురాణాలు, శాసనాల ఆధారంగా ఈ శక్తిపీఠాలను గుర్తింపగలగాం. ఈ శక్తి పీఠాలు మన దేశంలోనూ, ఇతర దేశాల్లోనూ కనిపిస్తున్నాయి.

పరిశోధకుల అంచనాలమేరకు ఆసియాఖండంలో 52 శక్తి పీఠాలు ఉన్నాయి. బాగా ప్రచారంలో ఉన్న వాటిలో 52 పీఠాలను దేశ, రాజ్యవివరాలతో పరిశీలించటం జరిగింది. శక్తి పూజ నేపథ్యన్ని తెలుసుకోవటం అవసరం. మానవుడు తన బుద్ధి శక్తి వికసించినప్పుడల్లా చుట్టూ తన ప్రకృతిని గురించి ఆలోచించసాగాడు. ఈ శక్తులన్నిటి వెనుక ఒక విశిష్టశక్తి ఉన్నదని తెలుసుకున్నాడు. ఆ శక్తినే "దేవుడు" అన్నాడు.



ఆ దేవుడుకి విభిన్నరూపాలను సమకూర్చి, వివిధ రకాల పేర్లు పెట్టారు. ఆ దేవతలకు విభిన్న కార్యాలను అంకితమివ్వసాగాడు. అందులోనూ స్త్రీ దేవతలకు ఎక్కువ మహిమనిస్తూ భయభక్తులతో ఆరాధించసాగాడు. ఈ ప్రక్రియలో త్రిమూర్తుల కల్పన రూపుదాల్చింది. వీరిని బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులన్నారు.

వారిని క్రమంగా సృష్టి, స్థితి, లయ కర్తలని పేర్కొన్నారు. వీరి భార్యలను సరస్వతి, లక్ష్మి, పార్వతి, వీరు విద్య, ధన మరియు మాతృరూపాలుగా భావించబడ్డారు.

సరస్వతీ పూజ, లక్ష్మీపూజ, ఆ దేవతల స్వాతిక రూపాలు. వైదికాచారాల ప్రకారం అర్చనలను అందుకొంటున్నారు. పార్వతిమాత్రం చాలా ఉగ్ర అవతారాలతో భగవతిగా పూజలందుకుంటోంది. ఈ రీతిగా శక్తిపూజ ప్రారంభమైంది. ఈ దశలో దేవి వైభవాన్ని తెలియచేయటానికి ఎన్నో కథలు సృష్టించబడ్డాయి.

శక్తి దేవతలను నానారూపాలలో గుర్తించడంలో ఒక క్రమ పద్ధతి ఉంది. ఈ రూపాలలో ప్రముఖమైనవి నవదుర్గలు, అష్టలక్ష్మీ దేవతలు.

ఆ రూపాలలో కొన్ని కింది విధంగా ఉంటాయి. ఆదిపరాశక్తి : మూల స్త్రీ దేవత, విశ్వరక్షకురాలు. దుర్గ : శివుని పత్ని అయిన పార్వతి యొక్క మరొక రూపం. ఈమెను అంబ, అంబిక అని పిలుస్తారు. లక్ష్మి : సంపద దేవత విష్ణపత్ని అష్టలక్ష్మీలమూలం. పార్వతి : ఈమె ఆదిపరాశక్తి. ఈమె దుర్గ మూలరూపం. ఈమెను గౌరి, ఉమ అని కూడా అంటారు. సరస్వతి : విద్యాదిదేవత, బ్రహ్మపత్ని. గాయత్రి: మంత్రాధి దేవత. గంగ : నది రూపంలో ఉన్న మాత. సీత : శ్రీమహావిష్ణువు అవతారమైన శ్రీరాముని భార్య. పంచమహాపతివ్రతలలో ఒకరు. రాధ : శ్రీమహావిష్ణువు

యొక్క మరో ఆవతరామైన శ్రీకృష్ణని ప్రియురాలు. సతి : శివుని మరొకరూపం శక్తిసంకేతం కాలాంతరంలో దుర్గారూపంగా ప్రసిద్ధమైంది.

ఉత్తర భారతంలో దుర్గాదేవి అర్చన ప్రముఖంగా ఉంది. దక్షిణ భారతదేశంలో ఈమెను దుర్గ అని చాముండి, కామాక్షి, మీనాక్షి, కన్యాకుమారి అనే పేరుతో పూజిస్తారు. ఇలా ఆదిపరాశక్తి విభిన్న రూపాలతో శక్తి పీఠాలలో అవతరించి భక్తులను కాపాడుతూ వుంది.

**శ్రీ శాంకరీ దేవి**

**శ్రీ సతీ శాంకరీ దేవీ - త్రింకోమలి పురస్థితా**

**ఉత్తమాంగ ప్రభాగౌరీ - భక్తకామ ఫలప్రదా**

###

## అష్టాదశ మహాశక్తి పీఠాలు

**1. శ్రీ శాంకరీదేవి - శ్రీలంకలంక**

అంటే చుట్టుతా నీళ్ళువున్న మెట్ట ప్రదేశం. లేదా నదిని ఆనుకుని వున్న మెట్ట ప్రదేశం. లలితాదేవి సుధాసముద్రంలో వుండే మణి ద్వీపంలో నివసిస్తుంది. అని తంత్రశాస్త్రం చెబుతోంది. కనుక. లంకలో వున్న దేవీ అంటే మణిద్వీపంలో వుండే లలితా పరాభట్టారిక అని చెప్పవచ్చును.

కొందరు ప్రస్తుతపు శ్రీలంకలో పశ్చిమ సముద్ర తీరాన గల త్రింకోమలీ పట్టణంలో గల దేవియే శాంకరీదేవి అంటున్నారు. జ్యోతిషశాస్త్ర ప్రకారం భూమధ్య రేఖను గీసి దానిలో సున్నా డీగ్రీల స్థానాన్ని గుర్తిస్తే అది లంకా పట్టణం అవుతుంది.

**లంకా కుమధ్యే యమకోటి రస్యాః**

## ప్రాక్పశ్చిమే రోమక పత్తనం చ

రావణాసురుడు పాలించిన లంకా పట్టణం భూమధ్యరేఖా లంకా పట్టణమే అని కొందరు పండితులు అంటున్నారు. ఈ పట్టణం ఇప్పుడు సముద్రంలో మునిగిపోయి వుంది. అందుకు కారణం అక్కడగల శాంకరీ దేవి రావణాసురునిపై కోపించి వెళ్ళిపోవటమే ఇందుకు ఒక పురాణ గాథ వుంది. ఒకప్పుడు రావణాసురుడు కైలాసానికి వెళ్ళి పార్వతీ దేవిని బంధించి తీసుకువద్దామని ప్రయత్నం చేశాడు. అది వాడివల్ల కాలేదు. పైగా పరాశక్తి యొక్క అస్త్రబంధానికి కట్టుబడి గిలగిల కొట్టుకోసాగాడు. ఆ తరుణంలో జ్ఞానోదయమై అమ్మవారిని పరిపరి విధాల ప్రార్థన చేశాడు.

అలా ప్రార్థించగా ఆ దేవి ప్రసన్నురాలై వరం కోరుకోమంది. నీవు నా పట్టణంలో స్థిరంగా వుండు తల్లి అని రావణుడు కోరగా, దేవి ఇలా అంది.

రావణా! నీవు చేసే అకృత్యాలవల్ల ఇప్పటికే నీ రాజ్యం సముద్రంలో మునిగిపోబోతూ వుంది. ఇప్పుడు నన్ను రమ్మంటున్నావు వస్తాను. నేనున్నంత కాలం నీ రాజ్యం నిలిచి వుంటుంది. కానీ నీవు మాటను ధిక్కరించిన మరుక్షణం నేనిక్కడనుంచి వెళ్ళిపోతాను. ఇలా చెప్పి ఆదేవి లంకానగంరంలో శాంకరీదేవిగా ఆవిర్భవించింది. రావణాసురుడు ఆమెను నిత్యమూ సేవిస్తూవుండే వాడు.

కొంతకాలానికి రావణాసురుడు సీతాదేవిని తెచ్చి ఆశోకవనంలో బంధించాడు. ఆ మర్నాడు రావణాసురుడు శాంకరీదేవి దర్శనానికి వెళ్ళగా ఆ తల్లి సీతాదేవిని బంధించటం తప్పని ఆమెను తక్షణం వదిలివేయమనీ, నయానా భయానా చెప్పిచూసింది. కామమోహితుడైన రావణాసురుడు మౌనంగా అక్కడనుంచి వెళ్ళిపోయాడు. దానితో ఆగ్రహించిన శాంకరీదేవి అక్కడనుంచి

ఆంతర్ధానమైపోయింది. అలా ఆంతర్ధానమై వెళ్ళిపోతున్న ఆదేవిని లంకా పట్టణంలోని ఉత్తమ సాధువులు కొందరు తల్లీ నీవు ఈ భూమిని విడిచి వెళ్ళిపోవద్దని గట్టిగా ప్రార్ధించారు.

వారి ప్రార్ధనలకు ఫలితంగా ఆ దేవి దక్షిణం నుంచి ఉత్తరానికి కాశ్మీరం మొదలైన క్షేత్రాలలో నిలబడి పోయింది. మహర్షి బృందాలు ఆమెను గుర్తుకోసం బనశంకరీ అని పిలిచారు. బనం అంటే వనం. అంటే ఆడవి. వనం అంటే నీరు అని కూడా ఈ తల్లి నీటిలో వుండే వనంలో నివసించి అక్కడినుంచి ఇక్కడికి వచ్చింది. కనుక ఆమెను బనశంకరీ అన్నారు. అమె కదంబ వనవాసిని కనుక కూడా బనశంకరీ అవుతోంది. సాధకులు ఆమెను వనదుర్గా మంత్రంతో ఉపాసన చేస్తూ వుంటారు. ఆయా స్థానాలలో వనదుర్గగా నెలకొన్న ఆ తల్లి రాక్షస గుణాలను సంహరిస్తూ ధర్మాన్ని భక్తులను పరిపాలిస్తూ వున్నది.



**శ్రీ కామాక్షీ దేవి**

**కాంచీపురాశ్రితే దేవి - కామాక్షీ సర్వమంగళా**

**చింతాతన్మాత్ర సంతుష్టా - చింతితార్థ ఫల ప్రదా.**

**2. శ్రీ కామాక్షిదేవి – కంచి**

ఒకనాడు కైలాసంలో పార్వతీదేవి దిగంబరంగా వున్న చెలికత్తెలతో సరసాలాడుతూ వున్నది. ఇంతలో అనుకోకుండా శివుడక్కడికి వచ్చాడు. పార్వతీదేవి కంగారుపడి దిగంబరంగా వున్న యోగినుల మానం కాపాడటం కోసం శివుడి రెండు కళ్ళూ తన ఆరచేతులతో మూసింది. ఈ

ఇంతలో బంగారువంటి ఆమె శరీరం నల్లగా మారిపోయింది. అది చూసి భయపడుతున్న పార్వతీదేవికి శివుడు ఇలా చెప్పాడు. గౌరీ! నీవు కొద్ది క్షణాలు నా కళ్ళు మూయటం వల్ల లోకాలకు సూర్యచంద్రులే లేక ఆకాల ప్రళయం సంభవించింది. ఆ జీవహింసా పాపంవల్ల నీకిలా జరిగింది. భయపడకు అని అన్నాడు. వెంటనే తను చేసిన తప్పిదానికి పశ్చాత్తాపంతో పార్వతి ప్రార్థించగా, శివుడు ఆమెకి ఇలా బోధించాడు. దేవీ నీవు చిన్న పిల్ల రూపంలో బదిరికాశ్రమమునకు వెళ్ళు. అక్కడ కాత్యాయన మహర్షి నిన్ను పుత్రికగా స్వీకరించి, ఎనిమిదేళ్ళు నిన్ను పోషించి మోక్షం పొందుతాడు. అక్కడి నుంచి నీవు కాశీనగరం మీదుగా కాంచీ నగరానికి వెళ్ళి అక్కడ సైకతలింగ రూపంలో వున్న నన్ను గూర్చి తపస్సు చెయ్యి నేను వచ్చి నిన్ను మళ్ళీ వివాహం చేసుకుంటాను అని అన్నాడు.

గౌరీదేవి శివుడు చెప్పినట్లుగానే కాత్యాయన పుత్రికయై అనంతరం కాశీక్షేత్రంలో కొన్నాళ్ళుండి కాంచినగరం చేరింది. అక్కడి మామిడి చెట్టు క్రింద గల ఏకామ్రేశ్వర

సైకత లింగాన్ని గుర్తించి అక్కడే తపస్సు చేయసాగింది. ఒకనాడు నారదమహర్షి ఆమెను చూసి ఆమె కార్యసిద్ధికై పంచబాణ మంత్రాన్ని (మన్మథాత్మకుడైన శివుని మంత్రాన్ని) ఆమెకు ఉపదేశం చాడు. గౌరి ఆ మంత్రంతోనే తపస్సుచేయసాగింది. అక్కడ శివుడికి కైలాసమంతా కామాగ్నిలో కాలిపోతున్నట్లు తోచింది. శివుడు యోగినీ గణాలను పిలిచి వారితో యోగ క్రీడ చేశాడు. అయినా ఆ జ్వాల తగ్గలేదు.

అప్పుడు గంగాదేవి ఇది గౌరీ తపస్సుకు ఫలితమని శివునికి వివరించింది. శివుడు గంగా ప్రవాహాన్ని బాగా పెంచి, దానిలో కూర్చున్నాడు. కొద్దిగా శాంతి కలిగింది. శివుడు గంగను పిలిచి గౌరీ తపస్సును పరీక్షించి రమ్మన్నాడు.

గంగ మహాప్రళయరూపిణి అయి కాంచీనగరం మీదకు దూకింది. గౌరి ఆ జలప్రవాహాన్ని చూచి తన చెలికత్తె అయిన దుర్గను ఆ జల నివారణకై పంపింది. దుర్గాదేవి విశ్వభక్షణమనే పేరుగల తన చేతి కపాలాన్ని ఎదురుగా పెట్టి, వచ్చే జలప్రవాహాన్ని అందులోకి ఆకర్షించింది. గంగతో పాటు శివుడు కూడా వచ్చి కపాలంలో పడ్డాడు. శివుడు కోపించి వేలరెట్లుగా జలప్రవాహాన్ని పెంచాడు. అంతటి ప్రవాహాన్ని ఆ కపాలం ఆపలేక పోయింది.

అది చూసి గౌరి భయపడి తన సోదరుడైన విష్ణువుని ప్రార్థించింది. విష్ణువు వచ్చి శివుడే నాకు గతి అని గట్టిగా ధ్యానిస్తూ, శివలింగాన్ని కౌగలించుకో, ఆయనే నిన్ను రక్షిస్తాడు అని చెప్పాడు. ఆయన చెప్పినట్టుగా పార్వతి భయంతో గట్టిగా లింగాన్ని కౌగలించుకోవటం వల్ల ఆ శివలింగంమీద ఆమె కంఠాభరణాల నొక్కులు పడ్డాయి. శివుడా స్పర్శకు పులకించి ప్రత్యక్షమై గంగను ఆపై పార్వతిని దగ్గరకు తీసుకున్నాడు. ఆ గుర్తులు ఈ నాటికీ ఆ లింగపైన మనకు కనిపిస్తాయి.

ఇదిలా జరుగగా అక్కడికి ప్రమధ గణాలన్నీ వచ్చి శివపార్వతుల కల్యాణం మళ్ళీ జరగాలని పట్టుబడ్డాయి. శివుడు విష్ణువును ధ్యానించి పార్వతికి, తనకూ వివాహ సన్నాహాలు చెయ్యమని కోరాడు. బ్రహ్మదేవుడు బ్రహ్మగా నిలబడగా విష్ణువు కాత్యాయనిని శివునకు కన్యాదానం చేశాడు. ఆ వివాహం రంగరంగ వైభవంగా జరిగింది. అపుడు గౌరీదేవి కేవలం తన చూపులతోనే భక్తులందరి కోరికలనూ

తీర్చింది. అది చూసి శివుడామెకు కామాక్షి దేవి అని నామకరణం చేశాడు. వివాహానికి వచ్చిన దేవతల, ఋషుల ప్రార్ధనవల్ల కామాక్షి ఏకామ్రేశ్వరులు శాశ్వతంగా ఆ పట్టణంలో వుండిపోవటానికి అంగీకరించి, ఆ క్షేత్రాన్ని ముక్తి క్షేత్రంగా చేశాడు.

**అయోధ్యా మధురా మాయా కాశీ కాంచీ ఆవంతికా !**

**పురీద్వారవతీ చైవ సప్తైతా మోక్ష దాయికా ||**

ఈ క్షేత్రం భూమికి కాంచీ స్థానమై (వడ్డాణపు స్థానమై) వుండటంవల్ల కాంచీక్షేత్రమని పేరు వచ్చింది. ఇక్కడ శివుడు ఏకామ్రేశ్వర రూపం లోనూ, విష్ణువు వరదరాజ రూపంలోనూ, శక్తి కామాక్షి రూపంలోనూ, ఇతర దేవతలందరూ తమ స్వరూపాలతోనూ నివసించి వున్నారు.



శ్రీశృంఖలాదేవి

## ధ్యాన శ్లోకం

**ప్రద్యుమ్నే వంగరాజ్యాయాం - శృంఖలా నామ భూషితే**

**విశ్వ విమోహితే దేవీ - శృంఖలా బంధనాశనీ**

### 3. శ్రీ శృంఖలా దేవి – ప్రద్యుమ్నం

ప్రద్యుమ్న దేశం ప్రస్తుతం పశ్చిమబెంగాల్ లోని హుంగ్లీ జిల్లా ప్రాంతమని పండితులు చెప్తారు. అక్కడి ప్రజలు కూడా అలాగే అంటున్నారు. వంగదేశం అనాదిగా శాక్తేయులకు నిలయం. ఇప్పటికీ అక్కడ తాంత్రిక శాక్తేయ సంప్రదాయం చాలా ప్రబలంగా వుంది. అక్కడ అమ్మవారి ఆలయంలేని గ్రామమే వుండదని చెప్పవచ్చు. ఆ ప్రాంతాన్ని వంగదేశమనీ, గౌడదేశమనీ పిలిచేవారు.

ఆంధ్రరాష్ట్రానికి ఉత్తరాగ్రంలో కళింగం. దాని పక్కన అంగదేశం. దాని పక్కన వంగదేశం వున్నాయి. అంగ, వంగ, కళింగ దేశాలు మూడూ కూడా శాక్తేయ సంప్రదాయానికి ప్రసిద్ధికెక్కినవే. ఒక్క వంగదేశంలోనే సతీదేవి అవయవాలు పడిన క్షేత్రాలు 10కి పైగా వున్నాయని ఆ రాష్ట్రం వారు చెపుతున్నారు. ఇక్కడ పూర్వకాలంలో గొప్ప గొప్ప ఆలయాలు ఆనేకం వుండేవి కూడా. కానీ శత్రు దేశాల తాకిడివల్ల,

ప్రకృతి ఉప ద్రవాలవల్ల అనేక ఆలయాలు, క్షేత్రాలు నామరూపాలు లేకుండా పోయాయి. అనేక చోట్ల ఉత్తమ ఉపాసకులైన మహాత్ములు క్షేత్రదేవతలను వేరేవేరే చోట్లకు తీసుకు వెళ్ళారని కూడా కొందరంటారు.

ప్రస్తుతం పశ్చిమ బెంగాల్ గాను, బంగ్లాదేశము గానూ బెంగాల్ గానూ విడిపోయి వుంది. ఈ రెండు ప్రాంతాలలోనూ శృంఖలాదేవి అనే క్షేత్రం ప్రస్తుతం ఎక్కడా కనిపించడంలేదు. (కొందరు హంగ్లీ జిల్లాలోని పాండుపా గ్రామంలో గల దేవియే శృంఖలాదేవి అంటున్నారు).

ఇలా కనిపించక పోవటానికి శత్రువుల తాకిడివంటి రాజకీయ కారణాలే కాక, మరికొన్ని ఆధ్యాత్మిక కారణాలు కూడా ఉన్నాయి. శృంఖలాదేవి అనే పదంలోని శృంఖలా అనే పదానికి సంకెల అని అర్థం. అప్పుడు శృంఖలాదేవి అంటే సంకెళ్ళు విడిపించే దేవి అని అర్థం చెప్పాలి. కానీ సత్యమిది కాదు. పచ్చి బాలింతరాలు వేసుకునే నడికట్టుకి శృంఖల అనే పేరు వుంది. కొత్తగా ప్రసవించి చంటివాడికి పాలిస్తున్న రూపంలోవున్న తల్లి కనుక, ఆమెను శృంఖలాదేవి అన్నారు.

ఈ క్షేత్రంలో సతీదేవి యొక్క కన్ను పడ్డదని కొందరూ, స్తనమే పడ్డదని కొందరూ చెబుతున్నారు. దేనికీ సరైన పురాణ ప్రమాణం కనిపించటం లేదు. అష్టాదశ పీఠాలలో వుంది కనుక సతీదేవి యొక్క ఆవయవం ఏదో ఒకటి మాత్రం ఇక్కడ పడి వుండక తప్పదు. అది అలా వుంచితే. ఈ క్షేత్రంలోని మూర్తి ప్రతిబింబించే మాతృప్రేమను అర్థం చేసుకోలేని పాథకులకు. ఇది ప్రమాదకర క్షేత్రంగా వుండేది కనుక, అనాటి గురువులు తమ శిష్యులలో ఉత్తములను మాత్రమే ఈ క్షేత్రానికి వెళ్ళనిచ్చేవారు.

త్రేతాయుగంలో దశరథ పుత్రిక అయిన శాంతను వివాహం చేసుకున్న ఋష్యశృంగమహార్షి సతీసమేతుడై ఈ దేవిని చాలా కాలం ఉపాసించాడు. చాలాకాలం ఉపాసించాక ఆయనకు ఆ దేవి యొక్క విచిత్రమైన అజ్ఞ ఒకటి మనస్సులో వినిపించ సాగింది. ఆ ఆజ్ఞకు బద్ధుడై ఋష్యశృంగ మహాముని అక్కడినుంచి దక్షిణ పశ్చిమంగా బయలుదేరి శృంగగిరి మహాక్షేత్రానికి వచ్చాడు.

వచ్చేటప్పుడు శృంఖలాదేవి యొక్క దివ్యశక్తిని పూర్తిగా తనలో నింపుకొని వచ్చేశాడు. అలా వచ్చిన ఆ మహార్షి శృంగగిరి శిఖరం పై దీర్ఘకాలం తపస్సు చేసి, ఆత్మానంద మగ్నుడయ్యాడు.

ఆ తరువాత శృంఖలాదేవి ప్రేరితుడై ఆ గిరికి ప్రదక్షిణంగా సంచరిస్తూ, ఆ శృంగగిరి ప్రాంతాలలోనే కొన్ని శక్తి క్షేత్రాలను ఏర్పరిచి వాటిలో శృంఖలాదేవి శక్తిని భాగాలుగా స్థాపించాడు. శృంగ మహార్షి స్థాపించిన దేవతలు కనుక, స్థానికులు ఆ దేవతలను శృంగలా దేవతలుగా కూడా పిలుస్తారు. ఆయన స్థాపించిన శక్తి క్షేత్రాలు ఇప్పటికీ భక్తులను అనుగ్రహిస్తూనే వున్నాయి. ఆ తరువాత కొంతకాలానికి ఋష్యశృంగ మహర్షి మళ్ళీ శృంగగిరి శిఖరానికి వెళ్ళి అక్కడే స్థిరపడిపోయాడు.

ఆ తరువాత రెండు యుగాలు దాటాక మూడవ యుగంలో అంటే కలియుగంలో, మూడువేల ఏళ్ళు గడిచాక, ఆదిశంకర భగవత్పాదులవారు శారదా దేవిని మహిష్మతీ నగరం నుంచి తీసుకొని వస్తూ, శృంగగిరి ప్రాంతానికి వచ్చేసరికి అక్కడగల శక్తి తరంగాలకు, స్వాతిక తరంగాలకు పరవశించిపోయారు. ఆ శారదాదేవి కూడా ఆ స్థానాన్ని మెచ్చి అక్కడే నిలబడి వేదధర్మ రక్షణ చేయాలని భావించింది.

అలా ఇద్దరి భావనలు ఏకమై శృంఖలా క్షేత్రాల ప్రాంతాలోనే శారదాపీఠం స్థాపించబడి శారదాదేవి కొలువుండిపోయింది.



**శ్రీ చాముండేశ్వరీ దేవీ**

## ధ్యాన శ్లోకం

### క్రౌంచపుర స్థితామతా -చాముండా దుష్టనాశనీ

### సర్వసిద్ధి ప్రదాదేవీ - భక్త పాలన దీక్షితా

#### 4. శ్రీ చాముండాదేవి - క్రౌంచ పట్టణం

మహిషాసురుని రాజధాని పేరు క్రౌంచ పట్టణం. ఈ రాక్షసుడ్ని పరాశక్తి మూడు సార్లు అవతరించి మూడు జన్మలలో సంహరించింది. అని కాళికా పురాణంలో వుంది. వీటిలో మహిషాసురుని మొదటి జన్మలో అతని రాజధాని క్రౌంచ పట్టణం దీనినే క్రమంగా ప్రజలు మహిమారు, మైసూరు వగైరా పేర్లతో పిలువసాగారు. ఒకప్పుడు మహిషాసురుడు ఇంద్రుని జయించి తానే ఇంద్రుడు అయ్యాడు.

అప్పుడు ఇంద్రాది దేవతలు బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులను శరణు పొందారు. అపుడు త్రిమూర్తుల మూఖాల నుంచి, ఇతర దేవతలందరి ముఖాలలోంచి కూడా వేరు వేరుగా దివ్య తేజస్సు బయటకు వచ్చి ఆవన్నీ కలిసి ఒక దేవీ మూర్తిగా ఆవిర్భవించాయి. ఆమెకు దేవతలందరూ తమతమ ఆయుధాలను బహూకరించారు. ఆమె సింహవాహనయై మహిషాసురునితో యుద్ధానికి బయలుదేరింది.

మహిషాసురుడు ముందుగా చిక్షురుడు, ఉదగ్రుడు, చామరుడు, మహా హనుడు, అసిలోముడు, భాష్కలుడు, పరివారితుడు, బిడాలుడు మొదలైన సేనాపతులను దేవితో యుద్ధం చేయటానికి పంపించాడు. ఆ యుద్ధంలో తన సైన్యమంతా

నశించగా మహిషాసురుడు స్వయంగా యుద్ధానికి వచ్చి ఆమె చేతిలో మరణించాడు. అనంతరం దేవతల, మునుల ప్రార్ధనల వల్ల ఆ దేవి ఆ పట్టణంలోనే పర్వతం మీద స్థిర మూర్తిగా నిలబడిపోయింది. ఆమె పేనే మహిషాసుర మర్ధని లేక చాముండేశ్వరి.

ఈ కథకు నిదర్శనంగా ఇప్పటికీ మైసూరులోని చాముండీ ఆలయానికి ఎదురుగా సర్పాలంకృతుడైన మహిషాసుర విగ్రహం కన్పిస్తుంది.



**శ్రీ జోగులాంబా దేవి**

## ధ్యాన శ్లోకం

## జోగులాంబా మహాదేవీ - రౌద్ర వీక్షణ లోచనా

## అలంపురీ స్థితా మాతా - సర్వార్థ ఫల సిద్ధిదా

### 5. శ్రీ జోగులాంబాదేవి - అలంపురం



ఆలంపురానికి పూర్వ నామధేయం హలంపురం. మరో పేరు హేమలాపురం. ఆంధ్రప్రదేశ్ లో మహబూబ్ నగర్ జిల్లాలో వుంది. పూర్వం ఇది హరి హర శక్తి క్షేత్రంగా ప్రసిద్ధి చెందింది. కానీ కాలాంతరంలో దాని ప్రభావం మరుగున పడిపోయింది.

ఇలా వుండగా ముక్తి క్షేత్రమైన కాశీ పట్టణంలో, ఒక శిల్పి కుటుంబంలోని మహిళ బాల వితంతువు అయింది. ఆమె అపార భక్తితో కాశీ విశ్వేశ్వరుని సేవిస్తూ వుండేది. ఒకనాడు ఆమె భక్తికి మెచ్చి కాశీ విశ్వేశ్వరుడు సాక్షాత్కరించి, తన హృదయంలో ఆమె భర్తను దర్శింప చేశాడు. ఏమి వరం కావాలో కోరుకోమన్నాడు.

విశ్వేశ్వరుడిలో 'భర్తను' చూసిన ఆ మహా సాధ్వి తనకొక పుత్రుడ్ని ప్రసాదించమంది. పుత్రుడు కలిగాడు. లోకం ఆమెను అనుమానంతో నిందించ సాగింది. పుట్టిన పిల్లవాడు ఊహగలవాడయ్యేసరికి, అవమానాలు భరించలేక, తన తండ్రి ఎవరని తల్లిని నిలదీశాడు. విశ్వేశ్వరుడే నీ తండ్రి అన్నది ఆ తల్లి.

అయినా ఆ కుర్రవాడు అన్నం ముట్టలేదు. నీరు ముట్టలేదు. శ్వాసకదల్చలేదు. విశ్వేశ్వరుడ్డి హృదయంలోంచి కదలనీయలేదు. చిరకాలం ఆ బాలకుని తపస్సు కొనసాగింది. ఒకనాడు విశ్వేశ్వరుడు ప్రత్యక్షమై కుర్రవాడ్డి ఒదార్చి ఇలా బోధించాడు.

నాయనా! లోకంలో ధర్మవ్యవస్థ ఒకటి వుంది. అది నేను నిర్మించిందే. ఇది గాక లోకోత్తర కార్యాల కోసం ఉత్తమజీవులు జన్మిస్తూ వుంటారు. వారి మార్గాలు విభిన్నంగా వుంటాయి. వారు చేయవలసిన పనులుకూడా లోకాతీతంగా వుంటాయి. వారి ముక్తి విధానం కూడా లోకాతీతమే. నీతల్లి, నీవు ఆ కోవలోని వారు. నీవు చేయవలసిన మహత్తర కార్యం ఒకటున్నది. నువ్వు ఇక్కడి నుంచి బయలుదేరి శ్రీశైలానికి పశ్చిమ ద్వారమైన హలంపురానికి వెళ్ళు. అది దక్షిణ కాశి ఎందుకంటే?

ఒక్కడ కాశిలో ఉత్తర వాహినీ గంగ వున్నట్లే, ఈక్కడ హలంపురంలో ఉత్తర వాహినీ తుంగభద్ర వుంది. ఇక్కడ కాశీకి ఇటూ అటూ వరణ -అసి నదులు వున్నట్లే అక్కడ హలంపురానికి ఇటూ అటూ వేదవతీ - నాగావళి నదులు వున్నాయి.

ఇక్కడ కాశీకి దగ్గరలో త్రివేణీ సంగమం వున్నట్లే అక్కడ తుంగభద్రా కృష్ణా సంగమం వుంది. ఇక్కడ 18 తీర్థాలు, 64 స్నానఘట్టాలు వున్నట్లే, అక్కడా వున్నాయి. ఇక్కడ నేనూ విశాలాక్షీ దేవి వున్నట్లే అక్కడ బాలబ్రహ్మేశ్వరుడు జోగులాంబ వున్నారు.

ఈ జోగులాంబ అనాది శక్తి పీఠాలలో ఒకటి. కాశీలో లాగానే తుంగభద్ర నది తీరంలో అనాదిగా మహర్షులు కోటిలింగాలను ప్రతిష్టించా రు. నేను అక్కడ బాలబ్రహ్మేశ్వరుడుగా అవతరించటానికి ఒక కథ జరిగింది.

ఒకప్పుడు బ్రహ్మకి సృష్టి చేసే శక్తి తగ్గిపోయింది. అందువల్ల ఆయన నన్ను గూర్చి, జోగులాంబ సన్నిధిలో తపస్సు చేశాడు. నేను అప్పుడు ఆయనకు ఒక బాల బ్రహ్మచారి రూపంలో దర్శనమిచ్చాను. ఆయన నన్ను గుర్తు పట్టి వెంటనే శివస్వరూపంగా ఆరాధించాడు. అందువల్ల అక్కడి నా మూర్తిని మునులందరూ బాల బ్రహ్మేశ్వరుడు అని పిలిచారు.

ఇలా కొన్ని యుగాలు గడిచింది. నా అంశతో జమదగ్ని మహర్షి జన్మించాడు. ఆయన జోగులాంబాంశతో జన్మించిన రేణుకా దేవిని వివాహ మాడి హలంపురంతో నా సన్నిధిలో తపస్సు చేస్తూ వుండేవాడు. మహా పతివ్రత అయిన రేణుకాదేవి రోజూ తుంగభద్రలో స్నానం చేసి, అక్కడి ఇసుకతో కుండచేసి, దానితో నీళ్ళు తెచ్చి పతిసేవ చేసేది. చాలా ఏళ్ళు జరిగాక, ఒక రోజున రేణుకాదేవి నదిలో స్నానం చేస్తూ వుండగా, ఒక గంధర్వ దంపతులు జలక్రీడలాడుతూ వుండటం ఆమె కంట పడింది. వారి ఐశ్వర్యానికి ఆశ్చర్యపోతూ, ఆమె అలా చూస్తూ వుండిపోయింది.

కొంతసేపటికి తెలివి వచ్చి గబగబా స్నానం ముగించి ఇసుకతో కుండ చెయబోగా ఆ రోజు కుండ తయారు కాలేదు. ఆమె కంగారు పడి విశేషంగా ధ్యానించి ఎలాగోలా

కుండ తయారు చేసి నీళ్ళు తీసుకు వెళ్ళింది. ఇంటికి వెళ్ళేసరికి, భర్త ఉగ్రుడై వున్నాడు. కుండ తయారు చేయడంలో ఆలస్యం ఎందుకు జరిగిందో, ఆయన గ్రహించాడు. ఆగ్రహంతో పుత్రులను పిలిచి ఆమె తల నరికి వేయమన్నాడు.

మొదటి నలుగురూ దానికి అంగీకరించలేదు. ముని మరింత మహోగ్రుడై ఐదవ పుత్రుడైన పరశురాముణ్ణి పిలిచి తల్లిని అన్నలనూ కూడా నరికి వేయమన్నాడు. మహా వేధావి అయిన పరశురాముడు అరక్షణంలో ఏదో అలోచించి, కన్ను మూసి కన్ను తెరిచే లోపల ఐదు తలలూ నరికేశాడు. పూర్తిగా చల్లబడిపోయిన జమదగ్ని మహర్షి కొడుకును కౌగిలించుకొని ఇష్టం వచ్చిన వరం కోరుకోమన్నాడు.

‘‘అన్నలనూ, తల్లిని బ్రతికించు, జరిగిన సంఘటనలు వారికి గుర్తులేకుండా చేయి’’ - అన్నాడు పరశురాముడు. జమదగ్ని పరశురాముడి తెలివికి ఆశ్చర్యపోతూ తథాస్తు అన్నాడు. అన్నలు బతికారు. రేణుకాదేవి మొడెం కదలసాగింది. తలా బతికింది. కానీ, ఎందుకో ఆ తల వచ్చి మొండానికి అతుక్కోవటం లేదు. జమదగ్ని ఆశ్చర్యపోయి ఏమిటా అని చూసేసరికి రేణుకా దేవి శిరస్సు కుండలు చేసే వారి చేతిలో వుంది. వారు అంతకు ముందే నుంచే ఆమెను తమకు మాతృమూర్తిగా భావిసున్నారు కనుక తెగిన రేణుకా దేవి తల వెళ్ళి వారి చేతిలో పడ్డది. మళ్ళీ బ్రతికినా సరే ! ఆ తల ఇక వెనక్కిపోవటం లేదు.

ఇది గమనించిన జమదగ్ని మహర్షి రేణుకాదేవి మొండెమును బాలబ్రహ్మేశ్వర స్వామికి ఎడమవైపున భూదేవిగా స్థాపన చేశాడు. రేణుకాదేవి శిరస్సును కుమ్మరివారు తమ కుల దేవతగా ఆరాధించుకునే ఏర్పాటు చేశారు. ఆనాటి నుంచి ఈమెను కుమ్మరివారు 'ఎల్లమ్మ' అనే పేరుతో గ్రామదేవతగా ఆరాధిస్తున్నారు.

ఆ తరువాత తుంగభద్రా, కృష్ణానదీ సంగమం స్థానంలో పరశురాముడు సంగమేశ్వర ప్రతిష్ఠాపన చేసి, అక్కడి పిండప్రదానాలు చేశాడు. అప్పటి నుంచీ హలంపురానికి పరుశురామ క్షేత్రం అని కూడా ప్రసిద్ధి వచ్చింది. బాల భక్తా! నీవు ఆ క్షేత్రాన్ని ఉద్ధరించడానికి జన్మించావు. నామరూపాలు లేకుండా శిథిలమైపోయి వున్న అక్కడ దేవతా మూర్తులకు నీవు వినూత్న మందిరాలు నిర్మించి భక్తులకు ఉపకారం చేయాలి.

రేణుకాదేవి ఇసుకలో కుండ చేసిన రసవిద్యనూ, దాని కంటే మహత్తరమైన బంగారం తయారుచేసే రసవిద్యనూ కూడా నీకు నేను అనుగ్రహిస్తున్నాను. శిలలు నీకు జీవవంతములై మాట వింటాయి. క్షేత్ర నిర్మాణ సంకల్పాలను నేను అనుగ్రహిస్తాను. నిన్నూ నీ తల్లినీ ఆ బాల బ్రహ్మేశ్వరుడే తగిన కాలంలో తనలో లయం చేసుకుంటాడు. నీవు నిర్మించిన హలంపురం క్షేత్రంలో నివసించే వారికి శ్రీశైల శిఖర దర్శనంకన్నా, కాశీ మరణంకన్నా అధికమైన ఫలాన్ని నేను అనుగ్రహిస్తాను అన్నాడు శివుడు.

ఈ విధంగా కాశీ విశ్వేశ్వరుడు చేసిన ఉపదేశం వల్ల, ఆ బాల భక్తుడు రససిద్ధుడై, తల్లిని వెంట బెట్టుకొని దక్షిణ దిక్కుగా బయలు దేరాడు. ప్రతిరోజూ అతడు ధ్యాన సమాధిగతుడై జ్ఞాన నేత్రంలో ఆలయాలను దర్శించేవాడు. కళ్ళు తెరిచి, రాళ్ళను అభిమంత్రించి కూలి వారితో, ఆలయ నిర్మాణం సాగించేవాడు. తన రసయోగంతో రాతి ముక్కలను బంగారు ముక్కలుగా మార్చి కూలీలకు జీతాలు ఇచ్చేవాడు. అలా బంగారాన్ని అకర్షిస్తూ ఉన్నందువల్ల క్రమంగా ఆ పురానికి హేమలాపురం అనే పేరు కూడా వచ్చింది.

చూస్తుండగానే ఆకాశాన్నంటే గోపురాలతో ఆలయ సమూహాలు గుత్తులు గుత్తులుగా వెలశాయి. మధ్యలో బాల బ్రహ్మేశ్వరాలయం దానికి ఇటూ అటూ కుమార బ్రహ్మ, అర్క బ్రహ్మ, వీర బ్రహ్మ, విశ్వ బ్రహ్మ, తారక బ్రహ్మ, గరుడ బ్రహ్మ, స్వర్గ బ్రహ్మ, పద్మ బ్రహ్మ అనే నవ బ్రహ్మల ఆల యాలు వెలశాయి. ఆ నవ బ్రహ్మలు లింగాకారంలోనే

వుంటారు. ఆలయాలన్నీ ఒకే మూసగా ఉంటాయి. బాల బ్రహ్మేశ్వరుడి తలపై మాత్రం చిన్న చిన్న గుంటలు వుంటాయి. ఈ లింగం చుట్టూ నారాయణ సాలగ్రామాలు వుంటాయి. ఈ లింగం మీద ఎన్ని నీళ్ళు పోసినా ఆ నీళ్ళు ఎటు పోతాయో కనిపించవు. రససిద్ధుడు బాలబ్రహ్మేశ్వర ఆలయంలోని గర్భగుడి లోనే జోగులాంబా దేవిని కూడా ప్రతిష్టించి, ఆమెకు ఇటూ అటూ చండీ, ముండీ విగ్రహాలను స్థాపించాడు. ఇసుకతో గణపతి విగ్రహం చేసి దానిని రససిద్ధి వినాయకుడు అనే పేరుతో గుడిలోని ఒక గూటిలో స్థాపించాడు. ఈ ఆలయంలోనే సప్తమాతృకా విగ్రహాలను కూడా ఆయన స్థాపించాడు. రససిద్ధి వినాయకుణ్ణి తడిమి చూస్తే గరుకుగా వుంటాడు. గట్టిగా రాస్తే ఇసుక రాలుతుంది.

బాల బ్రహ్మేశ్వరాలయానికి ఎదురుగా ఒక మండపంలో నాలుగు శిరస్సులతో బ్రహ్మమూర్తిని స్థాపించాడు. శివ, విష్ణు అభేద ప్రతి పాదకంగా, ఒక నరసింహస్వామి ఆలయాన్ని, చెంచులక్ష్మీ ఆలయాన్ని, మాధవీశక్తి ఆలయాన్ని, ఆంజనేయ ఆలయాన్ని కూడా నిర్మించాడు. ఇలా ఏరోజు కారోజు పెరిగి పోతున్న ఆలయ సంఖ్యతో తుంగభద్రా తీరమంతా కూడా, ఆలయాలతో నిండిపోయింది. జోగులాంబా క్షేత్రం శక్తిపీఠంగా ఖ్యాతి పొందింది.

## శ్రీ భ్రమరాంబా దేవి

### ధ్యాన శ్లోకం

**శివ పార్శ్వ స్థితా మాతా - శ్రీశైలే శుభ పీఠకే**

**భ్రమరాంబా మహాదేవీ - కరుణారస వీక్షణా**

### 6. శ్రీ భ్రమరాంబాదేవి - శ్రీశైలం

పూర్వము "అరుణాసురుడు'' అనే రాక్షసుడు ఉండేవాడు. వాడు తమోగుణ ప్రధానంగా ''గాయత్రి'' మంత్రం జపిస్తూ బ్రహ్మను గూర్చి పదివేల సంవత్సరములు తపస్సు చేశాడు. బ్రహ్మ వచ్చి వరము కోరుకోమన్నాడు అతడు ఆమరత్వము కావాలని కోరాడు. ''నాకే కాలము తీరాక శరీరము వదలక తప్పదు. ఇక నీకు అమరత్వం ఎలా ఇస్తాను''? అన్నాడు బ్రహ్మ.

అయితే "ఆయుధాల చేతగాని, స్త్రీపురుషుల చేతగాని నాకు మరణం రారాదు'' అని అరుణుడు కోరుకున్నాడు. ఆ వరబలంతో వాడు స్వర్గాన్ని ఆక్రమించి లోకాలను పీడించసాగాడు. దేవతలు



శివ, విష్ణువులను ప్రార్థించారు. ఆరుణుడికి గాయత్రీ జపం వల్ల ఈ శక్తి వచ్చింది. కనుక శివ, విష్ణువులు దేవతల చేత ‘‘అంబా యజ్ఞం’’ చేయించారు.

ఆ యాగం జరుగుతుండగానే బృహస్పతి అరుణాసురుడి దగ్గరకు వెళ్ళి ''మేము ఉపాసించే గాయత్రినే నీవు ఉపాసిస్తున్నావు. కనుక నీవు కూడా దేవ జాతిలో వాడివే, కనుక నా శిష్యుడవే'' అన్నాడు. ఆ మాటవిని అరుణుడు కోపించి గాయత్రీజపమే వదిలివేశాడు. ఇక్కడ దేవతలు రోజూ దేవీ ఉపాసన చేస్తుండగా, చివరకు ఒక రోజున దేవి సుందర రూపంతో ప్రత్యక్షమైంది. ఆ దేవి చుట్టూ కోట్లకొలది తుమ్మెదలు ఝుంకారాలు చేస్తూ ఉన్నాయి.

తరువాత దేవి ఆజ్ఞ వలన కోట్లకొలది ఆ తుమ్మెదల దండ్లు ఝుంకారిస్తూ ఆరుణాసురుడి, పురం మీద వ్రాలి రాక్షసులందరి తలకాయలు కొరికివేసాయి. బ్రహ్మ వరం ప్రకారమే ఆరుణాసుర సంహారము జరిగిన తర్వాత భ్రామరీ దేవి భక్తులను అనుగ్రహించటానికి భూలోకంలోనే ఉండదలచి సరైన ప్రదేశం కోసం అన్వేషించ సాగింది. అమె సహ్యాద్రి పంక్తుల వెంట తిరుగుతుండగా అద్భుతమైన మల్లె పొదల వాసన ఆమెను ఆకర్షించింది.

అక్కడి మల్లికార్జున జ్యోతిర్లింగాన్ని ఆమె దర్శించి అక్కడే ఉండిపోవాలని నిశ్చయించుకుంది. ఈమె మల్లికార్జున లింగానికి పశ్చిమంగా, కొంచెం ఎత్తుగా ఉన్నచోట స్థిరమూర్తి అయి నిలిచింది. ఈ దేవిని దేవతలు ఋషులు ''భ్రమరాంబ'' అని స్తుతించారు. ఆ కాలంలో ఆమెకు పద్దెనిమిది భుజాలు ఉండేవి. ఆ సమయములోనే మహిషాసురుడు అనే రాక్షసుడు విజృంభించగా వాడిని ఆమె సంహరించింది.

కానీ, వాడు ఆపై కల్పంలో తిరిగి జన్మించాడు. మళ్ళీ జన్మించిన జీవులను కథా సౌకర్యము కొరకై అదే పేరుతో వ్యవహరించటం పురాణముల సంప్రదాయం. ఈ రెండవ మహిషాసురుని కూడా ఈ దేవియే సంహరించింది. అప్పటికి ఆమె అష్టభుజి అయింది. ఆపై కల్పంలో కూడా మరల మహిషాసురుడు జన్మించాడు. అప్పటికి

వాడు కొంత పవిత్రుడై దేవిని గుర్తించి తనను వాహనంగా స్వీకరించమని ఆమెను ప్రార్థించాడు. దేవి ఇలా చెప్పింది.

ఓ మహిషా! మొదటి జన్మలో ఉగ్రచండీ రూపంతో (18 చేతులు) నిన్ను సంహరించాను. తరువాత జన్మలో భద్రకాళి రూపంతో నిన్ను సంహరించాను. ఇప్పుడు దుర్గారూపంతో నిన్ను నీ పరివారాన్ని సంహరించబోతున్నాను. కానీ పూర్వం నిన్ను నేను నాపాదాలతో తాకలేదు. ఇపుడు వరం కోరుతున్నావు కనుక, నా పాదాల దగ్గర వుండేలా నిన్ను అనుగ్రహిస్తాను అని అన్నది.

అందువల్లనే ఇప్పటి భ్రమరాంబామూర్తికి 8 చేతులు, ఈమెకు వాహనం మహిషాసురుడే. ఈ క్షేత్రంలో అర్ధనారీశ్వరీ దేవి అనాదిగా మల్లికార్జున శివలింగమునకు ప్రక్కనే ఉన్నప్పటికీ - భ్రమరాంబ వచ్చినప్పటినుంచీ ఈమే ఇక్కడి ప్రధాన శక్తి అయినది. భ్రమరాంబ మల్లికార్జునుల వివాహం గురించి జానపద కథలు, కన్నడ దేశీయ కథలు చాలా వున్నాయి. కానీ, వాటికి పురాణాధారం లేదు భ్రమరాంబా పీఠం అష్టాదశ శక్తిపీఠాలలో ఒకటిగా ఎంతో ఖ్యాతి పొందింది.



**శ్రీ మహాలక్ష్మి దేవి**

## మహాలక్ష్మీ భిదా దేవీ - కరవీర పుర స్థితా

## పురుషార్థ ప్రదామాతా - సంపూర్ణామృత వర్షిణీ

### 7.శ్రీ మహాలక్ష్మీదేవి - కోల్హాపురం

పూర్వం తమోగుణ ప్రాబల్యంతో కూడిన రజోగుణంతో పుట్టిన మహిషాసురుడు దేవతలను, ముల్లోకాలను పీడించగా, సత్వగుణ ప్రాబల్యంతో కూడిన రజోగుణంతో శ్రీ మహాలక్ష్మీదేవి అవతరించి వాణ్ణి సంహరించింది. (ఈమె విష్ణు పత్నికాదు. ఈమె అష్టాదశ (18) భుజములు గలది)

అప్పుడు దేవతలు మాకు శత్రుపీడ కల్గినప్పుడల్లా నీవు వచ్చి రక్షిస్తూ ఉండాలని మహాలక్ష్మీ దేవిని కోరారు. అంతట ఆ దేవి పెన్నానదీ తీరంలో పద్మావతం అనే పురంలో ఒక అంశతో స్థిరమూర్తిగా నిలిచిపోయింది. ఈ పురాన్ని పూర్వం యదు పుత్రుడైన పద్మవర్ణుడు నిర్మించాడు.

ఇలా ఉండగా ఒకప్పుడు బ్రహ్మదేవుడు మానవ సృష్టి చేస్తూ గయుడు, లవణుడు, కోలహుడు అనే ముగ్గురు మానస పుత్రులను సృష్టి చేశాడు. ఈ ముగ్గురూ మహాశక్తి వంతులయ్యారు. కానీ, కారణాంతరాలవల్ల విష్ణువు, గయ లవణులను సంహరించాడు. ఆ సందర్భంగానే గయాక్షేత్రం ఏర్పడింది.

కోలహుడు మూడవవాడు. కోలహుడు అనగా అడవి పందులను చంపేవాడు. అని అర్థం. మహావీరుడని భావం. ఈ పదమే కోల అయినది. ఈ పేరువల్ల ఇతడు తీవ్ర తమోగుణవంతుడు అని తెలుస్తున్నది. ఆ గుణం వల్లనే అతడికి దేవతల పైనా,

విష్ణువు పైనా పగ బయల్దేరింది. అప్పటికతడు పద్మావతపుర చక్రవర్తిగా ఉండేవాడు. రాజ్యపాలన సవ్యంగానే చేసేవాడు. ఎంత పగ బట్టినా, బ్రహ్మపుత్రుడు కనుక తపస్సు తోనే దేవతలను గెలవాలని నిశ్చయించుకున్నాడు. ఇతడు తీవ్రమైన తపస్సులో ఉండగా సుకేశి అనే రాక్షసుడు ఇతని రాజ్యాన్ని ఆక్రమించి, ధర్మ వ్యవస్థ ను ఛిన్నా భిన్నం చేసి, దేవతలను కూడా పీడించాడు. దేవలకు సుకేశిని ఎదురించటం సాధ్యంకాక కోలుడి తపస్సు పూర్తయితే అతడే సుకేశిని సంహరించగలడని ఎదురు చూడసాగారు. కోల్పుడి తపస్సుకి బ్రహ్మదేవుడు సుప్రసన్నుడై కోరిన వరాలన్నీ ఇచ్చాడు.

కోల్పుడు వరాలు పొంది స్వపురానికి చేరేసరికి అది అన్యాక్రాంతమై వుంది. దాంతో అతడు కోపించి ఘోరయుద్ధంలో సుకేశిని సంహరించాడు. అటుపైన తన పెద్ద కొడుకైన కరవీరుడ్ని యువరాజుగా చేసి, మిగిలిన ముగ్గురినీ అతనికి సహాయకులుగా పెట్టి, రాజ్య నిర్వహణ బాధ్యత వారికి అప్పచెప్పాడు.

పేరుకు తగ్గట్టే కరవీరుడు సుకేశిని మించి ఘోర కృత్యాలు చేశాడు. దేవతల ప్రార్థనల వల్ల శివుడు కరవీరుడ్ని, అతడి సోదరులను, సంహరించాడు, మరణించే ముందు కరవీరుడి కోరిక ప్రకారం పద్మావతపురం పేరును శివుడు కరవీరపురంగా మార్చాడు.

తన కొడుకులు నలుగురూ మరణించేసరికి కోలుడికి దేవతలపై కోపం పెరిగింది. కానీ అతడు మేధావి. ‘‘శ్రీమహాలక్ష్మీదేవి దేవతలకు అండగా ఉంది గనుక వారిని జయించటం కష్టంగా ఉంది.’’ అనుకున్నాడతను. అతడు మళ్ళీ తపస్సు చేసి మహాలక్ష్మిని ప్రత్యక్షం చేసుకుని ‘‘ఒక వందసంవత్సరాల పాటు నీవు ఈ పట్టణంలో ఉండరాదు’’ అని వరం కోరాడు. దేవికి వరం ఇవ్వక తప్పలేదు. అప్పటిదాకా రాజ్యపాలనలో ధర్మంగానే ఉన్న కోల్పుడు దేవల మీద ద్వేషంవల్ల ధర్మాన్ని ధ్వంసం చేయసాగాడు. గతిలేక దేవతలందరూ మళ్ళీ మహాలక్ష్మి దేవిని ఆశ్రయించారు. ఆమె వందయేళ్ళ దాకా ఆగక తప్పదంది.

విజయ పరంపరలలో ఉన్న కోల్హుడు గడువు మాట మరచి పోయాడు. నానాటికి అతని దుష్టత్వం పెరుగుతూనే ఉన్నది. గడువు తీరగానే దేవసేనా సమేతురాలై శ్రీమహాలక్ష్మీ దేవి కరవీరపురాన్ని ముట్టడించింది. యుద్ధం పెరిగి పెరిగి కోల్హుడే స్వయంగా యుద్ధానికి దిగి, దేవి చేతిలో చావుదెబ్బలు తిన్నాడు. అప్పటికి కళ్ళు తిరిగి అతనిలో అంతర్గతంగా ఉన్న బ్రహ్మ పుత్రత్వం బయటకు వచ్చి, దేవిని స్తుతించాడు.

మరణావస్థలో అతడు చేసిన స్తుతికి దేవి ప్రసన్నురాలై వరాలు కోరుకోమంది. అతడు మూడు వరాలు కోరాడు. ఒకటి "అమ్మా నన్నుక్షమించు, నీవు ఈ స్థానంలో స్థిరంగా సంపూర్ణకళతో నివసించు''. రెండు ''ఈ క్షేత్రాన్ని సిద్ధ క్షేత్రంగా చెయ్యి'', మూడు ఈ క్షేత్రానికి నా పేరు ఉండేలా చెయ్యి'' అని, ఆమె సరే అని వరమిచ్చి తరువాత అతన్ని బ్రహ్మాస్త్రంతో సంహరించింది.

దేవతలంతా అనందపడి అక్కడ దేవికి విశ్వకర్మచేత మండపం కట్టించారు. విశ్వకర్మ అక్కడ ఒక శ్రీ యంత్రాన్ని కూడా నిర్మించాడు. దేవి తనకు యుద్ధంలో సహాయం చేసిన దేవతల పేర్లతో తన చుట్టూతా అనేక తీర్థాలను ఏర్పాటు చేసింది.

ఇక్కడి ఈ దేవికి నాలుగు చేతులున్నాయి. పై కుడి చేతిలో క్రిందికి దిగి ఉన్న పెద్ద గద, క్రింది కుడిచేతిలో మాతలుంగ ఫలము. (దీనినే మాదీ ఫలమంటారు) పై ఎడమ చేతిలో డాలు, క్రింది ఎడమ చేతిలో పానపాత్ర ఉన్నాయి. ఈ దేవి శిరస్సు మీద ఒక నాగ పడగ దానిలో శివలింగము, యోనిముద్ర ఉన్నాయి.

దత్తాత్రేయేడు ప్రతి రోజు మధ్యాహ్నం ఈ కొల్హాపురలక్ష్మీ దగ్గరకు వచ్చి భిక్ష స్వీకరించటం అలవాటుగా పెట్టుకున్నాడు.

శ్రీదేవి అజ్ఞ మేరకు ఉత్తర దేశాన్ని దాటి వింధ్య పర్వత శ్రేణిలోకి ప్రవేశించిన అగస్త్యుడు, వింధ్యపర్వత గర్వాన్ని పోగొట్టి అటు తరువాత దక్షిణాపథంలోనే స్థిరపడి పోయాడు. అగస్త్యుడు, ఈ క్షేత్ర దర్శనం చేసి, దేవి సాక్షాత్కారం పొందాడు. కోల్హాపురంలో అనేక తీర్థ ఘట్టాలు దేవతా ప్రతిష్టలు ఉన్నాయి.

**ఏకవీరా దేవి**



**ఏకవీరా మహాశక్తి - మాహుగ్రామ గుహాస్థితా**

**భవానీ వీర విఖ్యాతా - ధర్మ రక్షణ తత్పరా**

## 8. శ్రీఏకవీరాదేవి - మాహురం

దత్తాత్రేయ స్వామి జన్మక్షేత్రమని ప్రసిద్ధి పొందిన మాహుర క్షేత్రం మహారాష్ట్రంలో వుంది. దీన్నే మాయూర గ్రామం అంటున్నారు. ఇది మహారాష్ట్రలోని నాందేడ్ జిల్లాలో నాందేడ్ కి 128 కిలోమీటర్లలో వుంది. ఇక్కడ మూడు కొండ శిఖరాలు వున్నాయి. వీటిలో ఒక శిఖరం మీద దత్తాత్రేయ స్వామి, మరోక శిఖరం మీద అత్రి, అనసూయాదేవి ఆలయాలు వున్నాయి.

మూడవ శిఖరాన్ని శ్రీ క్షేత్రం అని పిలుస్తారు. సతీ దేవి యొక్క కుడి స్తనము పడిన చోటుగా వర్ణిస్తారు. ఈ శిఖరం మీద ఏక వీరా దేవి విగ్రహం భయకరంగా దర్శనమిస్తుంది. ఆమెనే ఏకవీర్యకా, రేణుకా మాతా అని కూడా పిలుస్తారు.

ఇక్కడ అమ్మవారి పెద్ద తల మాత్రమే వుంటుంది. మెడ కూడా వుండదు. తలలో కూడా నోరు, ముక్కు వంకర తిరిగి ముఖం భయంకరంగా వుంటుంది. దానికి తోడు ఆ ముఖమంతా గంగ సింధూరం పూస్తారు.

ఇక్కడ తాంత్రిక విధానంలో అమ్మవారిని అధికంగా ఆరాధిస్తారు. క్షుద్రవిద్యలు కావల్సిన వారు జంతుబలులు ఇస్తారు. దీన్ని మాహు గ్రామమని గూడా అంటున్నారు. తులజాపూర్ అని గూడా అంటున్నారు. ఇక్కడి దేవిని శివాజీ ఆరాధించాడని ప్రతీతి.

## ఉజ్జయిన్యాం మహాకాళీ - మహాకాళేశ్వరేశ్వరీ

## క్షిప్రా తీరస్థితామాతా - వాంఛితార్థ ప్రదాయినీ

### 9. శ్రీ మహాకాళీదేవి - ఉజ్జయినీ

ఉజ్జయినీ క్షేత్రం అనాది ప్రసిద్ధి గల క్షేత్రం. దీనికి ఆవంతీ, కుశస్థలి, కనకశృంగి, పద్మావతి, అమరావతి, విశాల మెదలైన పేర్లు వున్నాయి. ఇది సప్తమోక్ష పట్టణాలలో ఒకటి.

ఇక్కడ శివుడి పేరు మహా కాళేశ్వరుడు జ్యోతిర్లింగం. దేవి పేరు మహాకాళి, శక్తి పీఠం. సతీదేవి మోచేయి పడిన చోటు ఇది. ఇక్కడ క్షేత్రం ఏర్పడటానికి పెద్ద కథ వుంది. తారకాసురుడికి ముగ్గురు కొడుకులు వుండేవారు. విద్యున్మాలి, తారాకాక్షుడు, కమలాక్షుడు అని.

వారు బ్రహ్మను గూర్చి తపస్సు చేసి యథేచ్ఛా సంచారం చేయగల మూడు పట్టణాలను సంపాదించారు. దానితో వారు విహరిస్తూ పట్టణాలు గ్రామాల మీద వాలి వాటిని భూస్థాపితం చేస్తూ వుండేవారు. దేవతలంతా బ్రహ్మను వెంట పెట్టుకొని శివుణ్ణి ప్రార్థించారు. శివుడు తనకు సహాయం కావాలన్నాడు. భూమి రథమైంది. మేరు పర్వతం ధనస్సు అయింది. విష్ణువు బాణమయ్యాడు. ఇలా సమస్త దేవతలూ శివుడికి సహాయకులుగా వచ్చారు.

ఇంత ఆర్భాటంగా దేవలతందరినీ వెంట బెట్టుకొని వెళ్ళిన శివుడు త్రిపురాసురులను చూస్తూనే, వికటాట్టహాసం చేశాడు. ఆ వికటాట్టహాసం లోంచి, ఒక అగ్ని బయలుదేరి

త్రిపురాలను ఏకకాలంలో కాల్చి వేసింది.

శివుడు విజయం సాధించిన ఆ ప్రదేశానికి ఉజ్జయినీ అని పేరు పెట్టారు. తరువాత చాలా కాలానికి దూషణుడు అనే రాక్షసుడు ఆ నగర ప్రాంతంలోనే రత్నమాల పర్వతాలలో నివసిస్తూ రోజూ ఊరివారికి పీక్కు తినసాగాడు.

చాలాకాలం గడిచాక, ఆ వూరి పెద్దలంతా విచారించి, ఆ వూళ్ళోనే ఊరి బయట ఏకాంతంగా, ప్రశాంతంగా నివసిస్తున్న ఒక బ్రాహ్మణుడి దగ్గరకు వెళ్ళి, ఈ ఆపద నుంచి రక్షించమని కోరారు. గుట్టు చప్పుడు కాకుండా మహా తపస్సు చేస్తున్న ఆ బ్రాహ్మణుడు ఊరి వారి మాటలను కాదనలేక అక్కడి జ్యోతిర్లింగేశ్వరుని ప్రార్థించగా. ఆ స్వామి ప్రత్యక్షమైన దూషణాసురుణ్ణి సంహరించి వేశాడు.

కాల రుద్ర స్వరూపుడై వున్న ఆ స్వామిని అక్కడే వుండి పొమ్మని ఆ భక్తుడు ప్రార్థించాడు. అప్పటి నుంచీ మహాకాలేశ్వర లింగ స్వరూపంతో, స్వామి అక్కడే నిలబడిపోయాడు. ఆ సమీపంలోనే పార్వతీ దేవి మహాకాళీ రూపంలో ఆవిర్భవించగా, ఆ భక్తుడు అక్కడ శ్రీ చక్రస్థాపన చేశాడు. కాలం పుంలింగమైతే, కాళి స్త్రీ లింగము. ఆయన కాలాన్ని మించినవాడు కనుక మహా కాలుడు. అక్కడి శక్తి మహాకాళి.

ఒకానొకప్పుడు కైలాసంలో శివపార్వతులు సరదగా చదరంగం ఆడుతున్నారు. ఆ సమయంలో ఆదేవి యొక్క మరో రూపమైన హరా దేవి కాపలా కాస్తోంది. ఇంతలో చండ-ప్రచండులచే రాక్షసులు ఇద్దరు అమ్మవారి భవనం బయట గోల చేయసాగారు. కాపలా వున్న హరాదేవి ఆరాక్ష సులను అడ్డుకోలేక లోపలి పార్వతీ దేవిని మనసారా ప్రార్థించింది. వెంటనే ఆ దేవి ఒక అంశతో ప్రత్యక్షమై ఆ రాక్షసులు ఇద్దరినీ సంహరించింది.

అలా క్షణంలో సంకల్ప సిద్ధి సాధించిన హరాదేవికి హరసిద్ధి అని పేరు వచ్చింది. ఈమె యొక్క ఆలయం మహాకాళేశ్వర ఆలయానికి ఎదురుగా వుంది. ఇక్కడి అన్నపూర్ణ, హరసిద్ధి, గౌరీ అనే దేవతలు ఒకరి పైన ఒకరు మలచబడి వున్నారు. వీరు కూడా మహాకాళీ | దేవియొక్క రూపాంతరాలే. ఇక్కడ | మహాకాళేశ్వరుని, మహాకాళిని ఆరాధించిన వారికి సమస్త సిద్ధులూ లభిస్తాయి. ఈ క్షేత్రం భూమికి నాభి స్థానం అని చెప్తారు. మధ్యయుగ జ్యోతిష శాస్త్రవేత్తలు ఈ పట్టణాన్ని భూమధ్యరేఖ యొక్క సున్నా డిగ్రీ స్థానంగా భావించారు.

***మహాకవి కాళిదాసు ఇక్కడి మహాకాళిని అర్చించి కాళిదాసుగా ఖ్యాతి పొందాడు.***



## ధ్యాన శ్లోకం

### పురుహూతీ సతీమాతా - పీఠికాపుర సంస్థితా

### పుత్రవత్పాలితా దేవి - భక్తానుగ్రహదాయినీ

**10. శ్రీ పురుహూతికాదేవి - పిఠాపురం**

పిఠాపురం అనాదిగా కుక్కుటేశ్వర స్వామి క్షేత్రం. ఇక్కడ శివలింగం కుక్కుటాకారంలో వుంటుంది. అంటే కోడి ఆకారంలో వుంటుంది. దీనికో కథ చెపుతారు. ఏలుడనే మహర్షి శివుడి జటాజుటం నుంచి, ఒక చిన్న నదిని తీసుకురాదలచి శివుని గూర్చి తపస్సు చేశాడు.

శివుడు ఒక చిన్న గంగాపాయ ఇచ్చాడు. కాని అది పెద్ద నది కావటం శివుడికి ఇష్టం లేక పోయింది. అందువల్ల ఏలముని ముందుకు నడుస్తుండగా, ఒకచోట తాను కోడి లాగా కూశాడు. ఏలముని వెనక్కి చూశాడు. కోడి ఆకారంలో వున్న శివుడు అక్కడే అలాగే శివలింగమై పోయాడు. ఆయనే కుక్కుటేశ్వర స్వామి.

ఏలముని వెంట వచ్చిన నదికి "ఏలా నది" అని పేరు వచ్చింది. ఆ నదిని ఆ ముని అక్కడి కోనేరులో కలిసేటట్లు చేశాడు. పూర్వ యుగాలలో గయాసురుడనే రాక్షసుడు మహా తపస్సు చేసి, చాలా పవిత్రుడయ్యాడు. కానీ తన శరీరాన్ని వేల యోజనాలు పెంచేశాడు. అపుడు బ్రహ్మ విష్ణు మహేశ్వరులే కలిసి, అతని శరీరం మీద ఒక మహా యజ్ఞం చేసేటట్లుగా ఆ రాక్షసుడితో ఒప్పందానికి వచ్చారు.

ఆ ఒప్పందం ప్రకారం అతడు కాళ్ళు చాచుకొని పడుకోగా, అతని శిరస్సు బీహారులోని గయ దగ్గరకు, పాదాలు పిఠాపురంలోని కుక్కుటేశ్వర స్వామి ఆలయం దగ్గరకు వచ్చాయి. ఆ పాదాలు వున్నచోట గొప్ప కొలను ఏర్పడింది. దానికి పాద గయ అని పేరు వచ్చింది. అప్పటి నుంచి పిఠపుర క్షేత్రం మరింత ప్రసిద్ధి కెక్కింది.

అదే క్షేత్రంలో సతీదేవి యొక్క అవయవ ఖండం కూడా పడింది. అప్పటి నుంచి అక్కడ ఒక శక్తి పీఠం వెలసింది. ఆ పీఠాన్ని మున్ముందు గా ఇంద్రుడు గుర్తించి ఆరాధించటం వల్ల ఆ దేవికి పురుహూతికా దేవి అని పేరు వచ్చింది. .

ఈ క్షేత్రంలో కుక్కుటేశ్వర స్వామి దక్షిణాభిముఖంగా వుంటాడు. ఆ స్వామికి ఎదురుగా ఒక చిన్న ఆలయంలో ఉత్తరాభి ముఖంగా పురుహూతికా శక్తిపీఠం నెలకొని వుంది. ఇలా ఈశ్వర, విష్ణు శక్తి పీఠాలతో పవిత్రమై ప్రకాశిస్తూ వున్న ఈ క్షేత్రంలోనే దత్తాత్రేయ స్వామి శ్రీపాద శ్రీవల్లభుడిగా అవతరించారు.

**శ్రీ గిరిజా దేవి**

**ఓఢ్రదేశే భువనేశీ - గిరిజానామ సంస్థితా**

**పాలికాఖిలలోకానాం - పల్లవారుణ పాణీనీ**

## 11. శ్రీ గిరిజా దేవి - ఓడ్యా ణం

ఓడ్యాణము అంటే, ఓఢ్ర దేశము. అంటే ఇప్పటి ఒరిస్సా దేశము. ఈ రాష్ట్రంలో కటక్ సమీపంలో వైతరణీ నది వుంది. ఈ నదీ తీరంలో వైతరణీ అనే

గ్రామం కూడా వుంది. ఇది ఇప్పటి జాజ్ పూర్ రోడ్ కి సుమారు 20 కి.మీ. దూరంలో వుంటుంది.

వైతరణీ నది అనేది జీవి శరీరం వదిలాక ముందుగా యమలోక ప్రయాణం చేసేటప్పుడు దారిలో వచ్చే నది. ఇక్కడి వైతరణి ఆ అంశతో జన్మించింది కనుక ఈ నది పిండ ప్రదానాలకు, పితృదేవతార్చనలకు ప్రశస్తమైనదని పురాణాలు వర్ణించాయి.

సతీదేవి యొక్క నాభిస్థానం ఈ వైతరణీ గ్రామంలో పడటం చేత అది మహాక్షేత్రమై శక్తి పీఠమై విరాజిల్లింది. మహాలక్ష్మి. మహాకాళీ, మహా సరస్వతీ అంశలతో కూడిన ఈ శక్తి పీఠాన్ని గిరిజా పీఠంగా మహర్షులు గుర్తించారు. స్థానికులు ఈమెను బిరజాదేవి అని కూడా పిలుస్తున్నారు. విరజానదీ తీరంలో వుండటం చేత, విరజా దేవి. బిరిజా దేవి అని స్థానిక భాషలలో మార్పు చెందటమే దీనికి కారణం.

ఇక్కడి గిరిజాదేవి ఈ నాటికీ త్రిశక్తి రూపిణిగానే పూజలను అందుకుంటోంది. ఇక్కడి దేవికి భక్తులు తలనీలాలు సమర్పించటం ఒక విశేషం. పితృ దేవతలకు పిండప్రదానాలు కూడా సమర్పిస్తారు. ఇక్కడ అనేక శివాలయాలు కూడా ఉన్నాయి.



వైతరణి నదిలోని ఒక దీవిలో శ్వేత వరాహ విష్ణుమూర్తి ఆలయం వుండటం ఇక్కడి విశేషం.

**శ్రీ మాణిక్యాంబా దేవి**

## ద్రాక్షావటీ స్థితాశక్తిః - విఖ్యాతా మాణిక్యాంబికా

## వరదా శుభదాదేవీ - భక్త మోక్ష ప్రదాయినీ

**12. శ్రీ మాణిక్యాంబాదేవి - దక్షవాటిక**

దక్ష ప్రజాపతికి దక్షిణాపథంలో కొంత రాజ్యభాగం వుండేది. దాన్ని దక్షవాటిక అని పిలిచేవారు. దక్షుడు ఆ ప్రాంతాన్ని విలాసమయంగా భోగ భూమిగా రూపొందించాడు.

దక్షయజ్ఞ భంగం తరువాత సతీదేవి యొక్క "కణిత'' (కంటి పక్కన గల ఎముక భాగం, కొడితే ప్రాణం పోయే చోటు) ఒకటి ఈ దక్షవాటికలో పడ్డది. అప్పటి నుంచీ అక్కడ "మాణిక్యాంబిక'' అనే పేరుతో ఒక శక్తి పీఠం వెలసి, అది ఒక క్షేత్రంగా వన్నెకెక్కసాగింది. ఇది ఇలా వుండగా తారకాసురుడు శివుని గూర్చి తపస్సు చేయసాగాడు.

తారాకాసురుడు ఇలా శివుని గురించి తపస్సు చేసి రెండు వరాలు పొందాడు. శివుడి అమృత లింగాన్ని తన హృదయంలో ధరించి వుండాలని ఒకటి. శివుడికి జన్మించిన పుత్రుడు మాత్రమే తనను సంహరించగలగాలని మరొకటి. శివుడికి పుత్రుడే పుట్టడనీ, ఎలాగో పుట్టినా తన హృదయంలో అమృత శివలింగం వుంటుంది కనుక, తనకు చావు సంభవించదనీ, వాడి ఆశ. కానీ శివ పార్వతీ కల్యాణం జరగనే జరిగింది. కుమార స్వామి జన్మించాడు. దేవతలు ఆయనను ప్రార్థించారు.

ఆయన దేవతల సేనాపతి అయ్యాడు. యుద్ధానికి వచ్చాడు. ఆ యుద్ధంలో కుమారస్వామి తన శక్తి ఆయుధంతో నేర్పుగా తారాకాసురుడి హృదయంలో గల అమృత శివలింగాన్ని బయటకు ఎగురగొట్టాడు. ఎగిరిన ఆ లింగం ఐదు ముక్కలై అయిదు చోట్ల పడి పొడుగాటి శివలింగాలుగా ఎదిగింది. అమృత ప్రభావం వల్ల ఆ అయిదు చోట్లా పంటలు, తోటలు బాగా పెరిగాయి. ఆ ఐదు ప్రదేశాలకీ పంచారామ క్షేత్రాలని పేరు వచ్చింది. ఆరామమంటే తోట.

దాక్షారామం అంటే వెనుకటి రోజులలో దక్ష ప్రజాపతి పాలనలో వుండిన దక్షవాటికే. తరువాత కాలాలలో అక్కడ ద్రాక్ష తోటలు బాగా పెరగటం చేత దాన్ని ద్రాక్షారామమని గూడా పిలువసాగాడు. దాన్ని బట్టే ద్రాక్షారం అనే వ్యవహార నామం వచ్చింది. ఆ విధంగా శక్తి పీఠంతో పాటు ఇక్కడ అమృత శివక్షేత్రం కూడా వచ్చేసరికి, క్షేత్ర ప్రశస్తి మరింత పెరిగింది. ఇక్కడి శివుడికి భీమేశ్వరుడని పేరు వచ్చింది.

ఇలా వుండగా సప్తరుషలకు ఈ స్వయం ప్రతిష్ఠుతులైన భీమేశ్వర స్వామికి మాణిక్యాంబకు పునఃప్రతిష్ఠోత్సవాలు చెయ్యాలని ఉత్సాహం పుట్టింది. దానికి మరొక ముహూర్తం నిశ్చయించుకొన్నారు. ముహూర్తం రేపనగా వారు దక్షారామం చేరారు. కానీ గోదావరి బహుదూరంలో ధవళేశ్వరం వద్ద వుండటం చేత ఈ క్షేత్రానికి తీర్థస్నాన సౌకర్యం లేకపోవటం వారికి బాధగా తోచింది. తామైతే ఆకాశ గమనంలో పోగలం. మరి సామాన్యుల మాటేమిటి? పైగా శివుడి నిత్యాభిషేకానికి నదీ జలం కావద్దా? అందువల్ల ఆ తెల్లవారు ఝామున వారు ధవళేశ్వరం వెళ్ళి, గోదావరీ స్నానం చేసి, ఆ నదీమ తల్లిని దక్షవాటిక పక్క నుంచీ ప్రవహించమని ప్రార్థించారు.

గోదావరి వారి వెంట బయలుదేరింది. సప్తర్షులు ఆకాశంలో సాగుతున్నారు. నది భూమి మీద పరుగులు తీస్తోంది. దారిలో ‘‘తుల్యభాగా’’ అని గోదావరీ ఉపనది ఒకటి వుంది. ఆ నదీ తీరంలో కొందరు మునులు భక్తి శ్రద్ధలతో యజ్ఞం చేస్తున్నారు. వస్తున్న వరద గోదావరి ఆ యజ్ఞశాలను పూర్తిగా ముంచేసింది. దాంతో కోపగించిన మునులు "గోదావరిని ఎండిపొమ్మని’’ శపించారు. అది విని ఆగ్రహించిన సప్తర్షులు

‘‘తుల్యభాగా నదిని తాకితే పాతకాలు అంటుకొంటా’’ యని శపించారు. ఇలా గందరగోళం జరుగుతుండగా, పూజ్యులైన తుల్యభాగ మహాముని వారిద్దరి మధ్యలోకి వచ్చి ఇరువర్గాలను శాంతింపచేశాడు.

నిజానికి ఈ మహర్షి సన్నిధి వల్లనే ఆనదికి తుల్యభాగా అని పేరు వచ్చింది. ఈయన దేవదానవులిద్దరికీ పూజ్యుడుగా వుండేవాడు. ఆయన వచ్చి ఆగమనే సరికి ఇరు వర్గాలవారూ కొంచెం తగ్గి, తిట్లు ఆపారు. ఆయన ఇద్దరి తగవులూ విని ‘‘ఇద్దరూ మంచిపనే చేస్తున్నారు. ఇద్దరూ లోకహితమే చేస్తున్నారు. మరి జీవనదులనిలా శపించటం తగునా! ముందు మీ శాపాలను ఉపసంహరించండి’’. అని నచ్చ చెప్పాడు. జరిగిన దానికి ఇరు వర్గాల వారు నొచ్చుకున్నారు. కానీ శాపాలను ఉపసంహరించటం సాధ్యం కాదు కనుక సవరణలు చేశారు.

‘‘గోదావరి ఇక్కడ ఇంకి పోయినా అంతర్వాహినిగా సాగి మళ్ళీ బయటపడుతుంది’’ అన్నారు దానవ మునులు "తుల్యభాగను రోజూ తాకరాదు కానీ. విశేష పర్వాలన్నిటిలోనూ తాకవచ్చు.

ఆ విధంగా రాజీ కుదిరి సప్తర్షులు గోదావరీ నదిని దక్షవాటి ప్రాంతానికి తీసుకువెళ్ళే సరికి, శివ లింగం ప్రతిష్టకు వాళ్ళు పెట్టుకున్న ముహూర్తం దాటిపోయింది. హడావిడి పడుతూ సప్తర్షులు వెళ్ళి చూసేసరికి భీమేశ్వర లింగాన్ని ఎవరో ప్రతిష్ట చెయ్యటమే కాక బ్రహ్మాండంగా పూజ గూడా చేసేశారు. సప్తర్షులకు, ముహూర్తం దాటి పోకుండా ప్రతిష్ట అయిందని ఒక పక్క సంతోషం, మరో పక్క తమకు

ఆ అదృష్టం తప్పిపోయిందే అని దుఃఖమూ కలిగింది. ఎవరా ఈ పని చేసింది అని వారు అలోచిస్తున్నంతలో సూర్య భగవానుడు దిగివచ్చి "మునులారా! తొందర పడకండి

మీ ముహూర్తం గొప్పది స్వామి ప్రతిష్టయిపోయాడు. ఆయన్ని ఎవనూ ప్రతిష్ట చెయ్యలేదు. అది గమనించి నేను పరుగు పరుగున వచ్చి మొదటి పూజ చేశాను. నా తరువాత బ్రహ్మ, విష్ణువు, ఇతర దేవతలు కొందరు అర్చనలు చేశారు'' అని చెప్పాడు.

''ఇదేమిటి? ఇలా జరిగిపోయింది'' అని సప్తర్షులు బాధపడుతుంటే ఆకాశంలో అశరీరవాణి వినిపించింది. ''మహర్షులారా! బాధపడవద్దు. మీ భక్తికి మెచ్చే భీమేశ్వరుడిలా చేశాడు. స్వామి నిత్యాభిషేకానికి గోదావరిని తెచ్చి వాకిట నిలిపారు. అది సామాన్యమైన పనా? మీరు పెట్టిన ముహూర్తం దాటి పోరాదనే స్వామి తనంత తానుగా ప్రతిష్ట పొందాడు. ఇక మీరు అర్చన చేయలేదని బాధపడవద్దు. మీరు ఏడుగురు మొదటి అర్చకుడు ఈ సూర్యుడు ఇక పైన మీ గోత్రాలవారికే ఈ స్వామికి అర్చన చేసే హక్కు వుంటుంది. ఆ విధంగా ఎనిమిది వంశాల వారు అక్కడి అర్చకులయ్యారు. అక్కడి గోదావరికి సప్తర్షుల వల్ల సప్త గోదావరము అని పేరు వచ్చింది. సప్తర్షులు మాణిక్యాంబా భీమేశ్వరులను స్తుతించారు. ప్రస్తుతం వున్న ఆలయం 14వ శతాబ్దిలో రెడ్డి రాజులు నిర్మించారు. ఈ ఆలయం ఊరి మధ్యలో 3ప్రాకారాలతో 4గాలిగోపురాలతో వుంది. ఇక్కడ ప్రస్తుత మాణిక్యాంబికా విగ్రహాన్ని శంకరాచార్య స్వామివారు ప్రతిష్టించారని ప్రతీతి.

ఆంధ్ర దేశానికి త్రిలింగ దేశమని పేరు వుంది. ఆ త్రిలింగాలు శ్రీ కాళహస్తి, శ్రీశైలం, శ్రీకాళేశ్వర లింగాలని ఒక పక్షం. శ్రీకాళహస్తి, శ్రీశైల, దాక్షారామ భీమేశ్వర లింగాలని ఒక పక్షం. మాణిక్యాంబాకా శక్తి భీమేశ్వర స్వామికి ఉత్తర దిక్కుగా వున్నది. మాణిక్యాంబికా శక్తి వల్లనే భీమేశ్వరం పంచరామాలలో మరింత ప్రసిద్ధ క్షేత్రంగా విరాజిల్లుతోంది.

**శ్రీ కామరూపీ దేవి**

**కామరూపిణీ విఖ్యాత - హరిక్షేత్రే సనాతనీ యోని**

**ముద్రాత్రిఖండేశీ - మాసే మాసే నిదర్శతా**

13. హరిక్షేత్రే కామరూపా

అస్సాం రాష్ట్రంలో కొండలు ఎక్కువ అందువల్ల ఆ రాష్ట్రాన్ని "అసమ" దేశం అని పిలిచేవారు. అంటే మెట్ట పల్లాలుగా వుండే చోటు అని అర్థం. అసమ పదమే అస్సాంగా మారింది. ఇక్కడ ప్రధాన నది బ్రహ్మపుత్ర.

ఈ ప్రాంతం హిమాలయాలకు దగ్గరగా, తూర్పుగా వుంటుంది. ఇక్కడ నీలాచలమనే ఒక పర్వతం వుంది. ఇది విష్ణుస్వరూపంగా, క్షేత్రంగా భావించబడేది. అందువల్ల ఈ ప్రాంతానికి హరిక్షేత్రమని కూడా పేరు వుండేది. సతీదేవి యొక్క దేహ భాగాలలో యోని భాగం ఈ పర్వతం మీద పడ్డది. సతీదేవి దేహత్యాగం అనంతరం శివుడు తపస్సులోకి వెళ్ళిపోవటం. తారకాసురుడు విజృంభించటం, దేవతలు మన్మథుడ్ని శివుడి మీదికి పంపడం - అందరికీ తెలిసిన కథే.

సాహసించి శివుడి మీదికి బాణం వేయడానికి బయలు దేరిన మన్మథుడు తను దాక్కోవటానికి అనువైన ప్రదేశాలు వెతుక్కుంటూ తనకు తెలియకుండానే నీలాచల పర్వతం మీద సతీదేవి యోనిభాగం పడిన చోటుకి వచ్చి, ఒక అనువైన చోట దాక్కొని బాణం వేయటానికి గురి చూస్తూన్నాడు మన్మథుడు అంటే శ్రీహరి అంశ అతడు స్వయంగా దేవీ భక్తుడు. ఈ కారణాల చేతనే అతడు సరిగ్గా ఆ ప్రదేశానికే వచ్చాడు. శివుడుపై బాణం వేశాడు. ఆ శక్తి పీఠం దగ్గరే భస్మం అయిపోయాడు. వెను వెంటనే రతీదేవి, ఇతర దేవతలు మొరపెట్టుకున్నారు. ఫలితం దక్కలేదు. కాముడితో పని లేకుండానే పార్వతీ కళ్యాణం జరిగిపోయింది. ఇది జరిగాక అమ్మవారు ప్రార్థించగా శివుడు మన్మథుడ్ని మళ్ళీ బతికించి ఆ పదవిలోనే వుంచాడు. ఈ పనివల్ల

కాముడికి శివ విజేత అన్న ఖ్యాతి వచ్చింది. దాంతో దేవతలకు, మునులకు అతడు చచ్చి బ్రతికిన చోటుపై దృష్టి పడింది. పడటం తోటే అక్కడ శక్తి క్షేత్రం వుందని వారికి అర్థమైంది. వెంటనే దేవతలు, ఋషులు గుంపులు గుంపులుగా వచ్చి పరిశీలించారు. నీలాచలంలో ఒకచోట స్త్రీ యోని వంటి శిల ఒకటి వుంది. ఆ శిలలోని సన్నటి జలధార వస్తున్నది. ఆ జలధార సంవత్సరానికి ఒకసారి 3రోజుల పాటు ఎర్రగా మారుతున్నది.

ఇది కాక మహాద్భుతమైన శక్తి వైభవం అక్కడ తేజరిల్లుతోంది. కాముడికి ఖ్యాతి వచ్చిన క్షేత్రం కనుక దేవతలు ఆ దేవిని కామాఖ్యా దేవీ అని ఆ క్షేత్రాన్ని కామాఖ్యా క్షేత్రమని పిలిచారు. కాముడికి తిరిగి రూపం వచ్చిన చోటు గనుక ఆ చోటును కామరూప క్షేత్రమని కూడా కొందరు మునులు కీర్తించారు. ఆ దేవిని కామరూపా దేవి అని కూడా అన్నారు.

అఖండమైన భక్తితో భూలోక వాసులు ఆ దేవిని ఉపాసించసాగాడు. త్రేతాయుగంలో పరశురాముడు తన తండ్రి ఆజ్ఞ ప్రకారం తన తల్లి తలను నరికి వేశాడు. ఆ తరువాత ఆమె మళ్ళీ బతకాలని తండ్రిని వరం కోరాడు. ఆమె మెండెం చిన్నమస్తా దేవిగానూ, ఆమె తల ఏకవీరా దేవిగానూ, ఇద్దరు దేవతలుగా జీవించారు. పరశురాముడికి తల్లి మాత్రం తిరిగి రాలేదు.

దానికే అతడు కుమిలిపోతూవుంటే అతడికి తల్లిని నరికిన గొడ్డలి అంటుకుపోయి వదలలేదు. ఏం చేయాలో తోచక వివిధ క్షేత్రాలకు వెళ్ళి వివిధ తీర్థాలలో స్నానాలు చేసి నానాయాతనా పడసాగాడు పరశురాముడు. చివరికి అతడు కామాఖ్యా క్షేత్రానికి వచ్చి, కొంత కాలం ఉపాసన చేశాడు. అక్కడ వున్న రోజుల్లో ఒకనాడు అనుకోకుండా దేవి ఆలయానికి తూర్పుగా ఉన్న బ్రహ్మకుండంలో స్నానం చేశాడు. ఆశ్చర్యం, అతని గొడ్డలి వూడి వచ్చేసింది. మాతృ హత్యా పాతకం కూడా ఈ క్షేత్రం వల్లా, ఈ కుండం వల్లా తొలగిపోయిందని గ్రహించిన పరశురాముడు ఆ క్షేత్ర కీర్తిని చేతనయినంత ప్రచారం చేశాడు.

తరువాత అతడు క్షత్రియ సంహారం చేయవలసి వచ్చింది. ఆ పనులన్నీ పూర్తి అయి కామఖ్యాదేవికి గొప్ప ఆలయం నిర్మించి బ్రహ్మకుండానికి మెట్లు కట్టించాడు. అప్పటి నుంచీ ఆ కుండానికి "పరశురామకుండం'' అని కూడా పేరు వచ్చింది.

పరశురాముడు ఉత్తములైన అర్చకుల కుటుంబాలను కూడా అక్కడకు తరలించి ఆ ప్రాంతంలో నివాస యోగ్యమైన గ్రామాలను ఏర్పరచి, కామాఖ్యా దేవికి నిత్య పూజలు జరిగే ఏర్పాటు కూడా చేశాడు. నీలాచలానికి సమీపంలో వున్న మహానగరం "ప్రాక్ - జ్యోతిషపురం''. ఇది అనాదిగా గొప్ప నగరం. దీన్ని ఇపుడు గౌహతి అని పిలుస్తున్నారు. ద్వాపర యుగం వచ్చేటప్పటికి ఇక్కడి రాజ్యం అసుర వంశాల చేతిలోకి వెళ్ళింది. అసురులు అనగానే కోరలు, పెద్దగోళ్లు వగైరా వుండే విచిత్ర జీవులు కాదు. వారూ మానవులే. అయితే ఆ జాతిలో దుర్మార్గుల శాతం ఎక్కవ.

అంత మాత్రం చేత ఆ జాతి వారందరూ దుర్మార్గులే అనుకోరాదు. వారిలో కూడా సాధువులు, మహాత్ములు వున్నారు. శ్రీకృష్ణ పరమాత్మ ద్వాపరయుగం చివరి ప్రాతంలో అవతరించాడు. అంతకు కొంచెం ముందుగానే నరకుడు అనే దానవుడు ప్రాక్-జ్యోతిషపురానికి రాజై కామాఖ్యాదేవిని పూజిస్తూ వున్నాడు. ఇంతలోనే అతనికి బాణాసురుడు అనే మరో అసుర రాజుతో స్నేహం పెరిగింది. ఇతడు దేవతలు దానవులు సమానులేననీ, అందులోనూ నరకుడు అందరికన్నా మహా బలవంతుడు కనుక దేవతలకన్నా గొప్పవాడనీ, నరకాసురుడికి నూరిపోశాడు.

అంతేకాక ఈ కామాఖ్యా దేవత పెళ్ళి కాని పిల్ల అని, అందువల్లే ఆమెకు ఆ పేరు వచ్చిందనీ, మిగిలిన కథలన్నీ కట్టుకథలనీ, ఉపదేశాలు చేశాడు. ఆ రోజుల్లో కామాఖ్యాదేవి ఏకాంతంగా వున్నప్పుడు సాయంత్రాలలో ఆనంద నృత్యం చేసుకుంటూ వుండేది.

ఒక రోజున నరకాసురుడు ఆలయానికి వచ్చేసరికి అమ్మవారు నృత్యం చేసుకుంటూ వున్నది. బాణాసురుడి ఉపదేశాలు తలకెక్కిన నరకాసురుడు ఆ సుందర రూపానికి సమ్మోహితుడై ‘‘తనను వివాహం చేసుకోమని’’ ఆ దేవిని కోరాడు. చిత్రంగా ఆ దేవి అందుకు ఒప్పుకుంది. కానీ ఒక షరతు విధించింది. ‘‘పాక్-జ్యోతిష పురం నుంచీ ఈ క్షేత్రం దాకా రథాలు వచ్చేంత రహదారులను నిర్మించి, కొండకు మెట్లు చెక్కించి, వచ్చే జనులకు నీటి ఎద్దడి లేకుండా సరిపోయేటంత పెద్ద చెరువులు తవ్వించి, ఆలయ ప్రాకారాలు వృద్ధి చేయాలి. ఆ పని అంతా రేపు తెల్లవారి కోడి కూసే లోపల అయిపోవాలి. అలా చేసేటట్లయితే తాను వివాహానికి ఒప్పుకుంటా’’నని అంది కామాఖ్యా దేవి. "సరే’’ అన్నాడు నరకాసురుడు.

‘‘దేవతలు నీకు విఘ్నాలు కల్పిస్తారు. వాటిని తట్టుకొనే బాధ్యత నీదే’’ అని హెచ్చరించింది. దేవి నరకుడు వికటంగా నవ్వి తన రాక్షస శక్తులతో వేగంగా పనులు చేయసాగాడు. చెప్పిన పనులన్నీ మహా వేగంగా సాగిపోతున్నాయి. అర్ధరాత్రి దాటిపోయింది. దేవతలెవరికీ ధైర్యం చాలలేదు. ఇక లాభం లేదని విష్ణుమూర్తి ఒక కోడి రూపంలో వచ్చి కూశాడు.

విష్ణుమాయను గ్రహించలేని నరకాసురుడు తన ఓటమికి మండిపడి తను కట్టిన ఆలయాన్ని తనే కూల్చి వేశాడు. ఆ దేవి ఇక వాడికి కనిపించ లేదు. ప్రజలకు మంచి రహదారులు మాత్రం లభించాయి. అప్పటి నుంచీ నరకాసురుడు మరింత క్రూరుడై దేవీ భక్తులను, విష్ణు భక్తులను కూడా పీడించి అమ్మవారిమీద ద్వేషంతో పదహారువేలమంది కన్యలను బంధించి వేశాడు. ,

ఆ పాపాలకు ఫలితంగానే శ్రీకృష్ణ పరమాత్మ నరకాసుడి మీదకి యుద్ధానికి వచ్చి ముందుగా అతడిని సత్యభామ చేత కొట్టించి తరువాత తను సంహరించాడు. శ్రీకృష్ణుడు నరకాసురుడి మీదకి ముట్టడి చేయడానికి ప్రధానంగా అశ్వసైన్యం

తెచ్చాడు. ప్రత్యేక శిక్షణ పొందిన ఆ అశ్వాలు ప్రాక్-జ్యోతిషం చుట్టూ గల కొండలను అవలీలగా ఎక్కిదిగాయి. కృష్ణుడు స్వయంగా అశ్వారూఢుడై ఎక్కిన కొండను అప్పటి నుంచి అశ్వక్రాంతమని పిలుస్తూనే వున్నారు. ఈ పర్వతం గౌహతికి ఉత్తరంగా వున్నది. దాని మీద గుఱ్ఱపు డెక్కల గుర్తులు వున్నాయి.

ఇలా వుండగా 13వ శతాబ్ది ప్రాంతాలలో బిష్వ సింహుండు, శివసింహుడు అనే ఇద్దరు రాజ యువకులు ఒకసారి అడవిలో పోతూ నీలాచలం మీదకి వచ్చారు. ఆ కీకారణ్యంలో వారికొక చిన్న గుడిసె కనిపించింది. ఆ దగ్గరలోనే ఒక మంట వంటి వెలుగు, ఆ వెలుగు పక్కన ఒక ముసలమ్మ కనిపించారు. వేరే నరసంచారం లేదు. వారు ఆ ముసలమ్మను మంచినీరు కావాలని ప్రార్థించారు. ఆమె కొద్దిగా దూరం నడిపించి బ్రహ్మకుండం చూపింది. రాజయువకులు నీరు త్రాగి సేద తీరారు.

"ఆ జ్వాల ఏమిటని ఒంటరిగా ఏలా జీవిస్తున్నావని" వారు ఆ వృద్ధాంగనను అడిగారు. ఆమె ఇది కామాఖ్యా క్షేత్రమని, గుడి కూలిపోయిందని, ఈ దేవి అనుగ్రహిస్తే రాజ్యం వస్తుందని, వివరంగా చెప్పింది. ఆ యువకులు సంతోషపడి "మా సైన్యం తప్పిపోయింది. అది దొరికితే మాట విశ్వసిస్తా' మన్నారు. కొద్దిసేపటికే చాలా గుట్టాలు వస్తున్నట్లు చప్పుడు వినిపించింది. గుఱ్ఱాల డెక్కల చప్పుళ్ళకు భయపడి చెట్లెక్కిన ఆ యువకులు ఆ వచ్చేది తమ సైన్యమే అని గుర్తించి ఆశ్యర్యపోయారు.

అందరూ కలిసి కామాఖ్యాశక్తిని సేవించి తమకు రాజ్యం వస్తే బంగారు గుడి కట్టిస్తామని మొక్కుకున్నారు. రాజ్యం వచ్చింది. మొక్కు మరచిపోకుండా కామాఖ్యా క్షేత్రాన్ని వెతుక్కుంటూ వచ్చి చాలా ప్రయాసపడి అడవిలో ఆ చోటు గుర్తుపట్టారు. కూలిపోయిన ఆలయం పునాదుల పైననే మళ్ళీ గోడలు కట్టించ సాగారు. శిఖరాలు
*************************************

క భోరు భోరున విలపించారు. ఆ రాత్రి దేవి కలలో కనిపించి., ''బంగారు గుడి కట్టిస్తామని వాగ్దానం చేసి రాతి గుడి కట్టిస్తున్నారేమిటి? అని అడిగింది. "తల్లీ ! అంతటి పెద్ద రాజ్యం దక్కలేదు'' అని విన్నవించారు. ఆ దేవి నవ్వి "అందుకే ఒళ్ళు తెలియకుండా మొక్కుకొరాదు. సరే ! ఈ మీద రాళ్ళ మధ్యలో కొద్ది కొద్దిగా బంగారు ముక్కలు వేసి గుడి కట్టండి నిలుస్తుంది'' అని దేవి పలికింది.

త్వరలోనే వారు ఆలయం పూర్తి చేసి, మళ్ళీ అర్చక కుటుంబాలను తెచ్చి నిత్యార్చన వ్యవస్థ ఏర్పాటు చేశారు. ఆ క్షేత్రంలో ఇతర ఆలయాలు కూడా అనేకం నిర్మించారు. 16వ శతాబ్ది వచ్చేసరికి నరనాయణుడు, చిలార్రై అనే రాజ సోదరులు ఈ ఆలయాన్ని పునరుద్ధరించ దలిచారు. అందుకై మహారాం బైశ్య అనే వ్యక్తిని నియమించారు. కూలిపోయిన గోడల్లో బంగారపు ముక్కలు దొరికేసరికి ఆ వ్యక్తి ఆశను చంపుకోలేక బంగారం పోగుచేసుకోసాగాడు. దేవి రాజుకి ఈ విషయం కలలో చెప్పింది. రాజు అతనికి యావజ్జీవ కారాగార శిక్ష విధించి మేఘామక్ డోస్ అనే వ్యక్తి ద్వారా ఆలయాన్ని నిర్మింపచేశాడు. అతడు నిర్మించిన ఆలయమే ఇప్పటికీ దర్శనమిస్తోంది.

ఆ రోజులలో కెందుకలై అనే మహోపాసకుడు అర్చకుడిగా వుండేవాడు. ఆయన మహా వృద్ధుడు. కామాఖ్యాదేవి చేసే ఏకాంత నృత్యాన్ని ఆయన ప్రతిరోజూ స్వయంగా చూడగలిగే వరం పొంది వున్నాడు. ఒక రోజున రాజ సోదరులు ఆ మహాత్ముని దగ్గరకు వెళ్ళి, తమకు కూడా ఆ నృత్యాన్ని చూపమని కాళ్ళు పట్టుకొని ప్రార్థించారు. ఆ వృద్ధుడు చివరికి మొహమాటపడి దేవి నృత్యం చేసే సమయం చెప్పి ఆ సమయానికి తాను ఆలయంలో వుంటానని వారిని చప్పుడు చేయకుండా వచ్చి కిటికీలోంచి చూడమని చెప్పాడు.

వారు అలాగే చేశారు. వారు పొంచి చూసే సరికి ఏదో మెరుపు ఒక క్షణం కదిలినట్లు అయింది. ఇంతలో మాయమైపోయింది, వేరే ఏమీ కనబడలేదు. ఇదేమిటి అని తలతిప్పి చూసేసరికి వృద్ధుడు శిలగా మారిపోయి వున్నాడు. ఆ శిలావిగ్రహం

ఇప్పటికీ దేవి ఆలయంలో వుంది. తమవల్ల ఆవృద్ధ భక్తుడు దేవి శాపానికి గురి అయ్యాడని అర్థం చేసేకొని రాజ యువకులు బాలా బాధా పడ్డారు. కానీ ఏమీ చేయలేక పోయారు.

అప్పటి నుంచి ఆ దేవి ఏకాంత నృత్యాలను మానుకున్నది. అని స్థానికులైన ఉపాసకులు చెబుతున్నారు. ఇప్పటికీ ఆ దేవి అనుక్షణం ఇలా మహిమలను చూపుతూనే వుంది. ఈ క్షేత్రం చుట్టూ ఇంకా అనేక తీర్థాలు ఆలయాలు వున్నాయి. ఆలయ సమీపంలోని ఊర్వశీకుండం ఎంతో ప్రసిద్ధమైంది. ఈ కుండంలో స్నానం చేసి కామాఖ్యా ఆలయంలోకి ప్రవేశించాలి. ఆలయం పల్లంగా వుంటుంది. మెట్లు దిగి వెళ్ళాలి. ఈ మెట్లు చాలా పవిత్రమైనవి. కామాఖ్యా పీఠ దర్శనం చేసి అక్కడ జలధారను తీర్థంగా స్వీకరించాలి. మృగశిర కార్తె వెళ్ళి ఆరకార్తె ప్రవేశించేటప్పటికి, భూమి రజస్వల అవుతుందని దేవీ భాగవతంలో వుంది.

సామాన్యంగా ఇది ఆషాఢమాస ప్రారంభమవుతూ వుంటుంది. వర్షఋతువు మరోక నెల దూరంలో వున్నప్పటికీ మొదటి వాన చినుకులు ఈ కార్తెలోనే పడతాయి. సరీగా అదే సమయానికి కామాఖ్యా పీఠంలోని జలధార ఎర్రగా మారుతుంది. అప్పుడు 3 రోజులు పాటు అమ్మవారి ఆటయాన్నీ చుట్టు పక్కల అన్ని అలయాలను 3 రోజుల పాటు మూసివేస్తారు. ఈ సమయాన్ని "అంబుబాషి మేళ" అని పిలుస్తారు. ఈ సమయంలో అమ్మవారికి కట్టిన వస్త్రాలు ఎర్రబడతాయి. వాటిని ఉపాసకులు అత్యంత శ్రద్ధతో పూజలలో పెట్టుకొని అర్చిస్తారు. నాలుగవ రోజున అమ్మవారి ఆలయాలు తెరుస్తారు.

## మాధవేశ్వరీ మాంగళ్యే - ప్రయాగ స్థల వాసినీ

## త్రివేణీ సంగమే తీరే - భుక్తి ముక్తి ప్రదాయిని

### 14. ప్రయాగే మాధవేశ్వరి

పూర్వం సరస్వతీ నది అని ఒక నది వుండేది. ఆమె గంగా యమునల మధ్యలో ప్రవహిస్తూ వుండేది. గంగా యమునలను ఇడా పింగళలు గానూ, సరస్వతి నదిని, సుషుమ్ననాడీ గానూ మహర్షులు భావించేవారు. సరస్వతి నది వెంబడి ఉత్తమోత్తములైన మహర్షులు ఎందరో నివసించే వారు. సరస్వతీనది ఉన్నంత కాలం గంగకు ఈ నాడు ఉన్న ప్రశస్తి ఉండేది కాదు. కానీ, గంగా యమునా సరస్వతులు మూడు కలసి త్రివేణి సంగమమ క్షేత్రాన్ని మహోర్షులందరూ ఉత్తమోత్తమ క్షేత్రంగా భావించేవారు. అందువల్ల ఆ క్షేత్రాన్ని అందరూ సంగమ క్షేత్రమని పిలిచేవారూ.

ఆ క్షేత్ర మహత్యా్మ నికి ఆకర్షితుడైన బ్రహ్మదేవుడు అక్కడ వరుసగా యజ్ఞాలు చేశాడు. ప్రజాపతి యాగాలు చేసిన స్థానం కనుక, ఆ క్షేత్రానికి ప్రయాగ క్షేత్రం అని పేరు వచ్చింది. ప్ర+యాగ, ప్ర అంటే గొప్ప అని, ప్రజాపతి అని, రెండర్థాలు. గొప్ప యాగాలు జరిగిన చోటు కనుక, ప్రజాపతి యాగాలు చేసిన చోటు కనుక, అది ప్రయాగ క్షేత్రమైంది. ఈ క్షేత్రాన్ని ఇప్పుడు అలహాబాద్ అంటున్నారు. ఇది అక్బరు చక్రవర్తి పెట్టిన పేరు. ఇదిలా ఉండగా దేవ దానవులు కలసి సముద్ర మధనం చేసారు. అమృతభాండం బయటకు వచ్చింది. విష్ణువు మోహినీ రూపంలో వచ్చి, దేవతలకు అమృతం పోసాడు. అడ్డు వచ్చిన రాహూవును నరికేశాడు. గందళగోళం మొదలైంది. ఇంచుమించు ఖాళీ అయిపోయిన అమృత భాండాన్ని అక్కడే పెట్టి మొహినీ మాయమైపోయింది.

బృహస్పతి తెలివైనవాడు మాత్రమే కాక పరుగులో సాటిలేని వాడని వేదంలోనే వుంది. ఆ బృహస్పతి టక్కున ఈ అమృతభాండం చేత పుచ్చేకొని పరుగు లంకించుకున్నాడు. అసురులు వెంటపడ్డారు. బృహస్పతి మరింత వేగంగా పరుగెత్తడంతో ఆ కుంభం లోంచి నాలుగు అమృత బిందువులు కిందికి ఒలికి సరాసరి ఈ ప్రయాగ సంగమ క్షేత్రంలో పడ్డాయి.

అప్పటి నుంచి ఈ క్షేత్రానికి అమృత తీర్థమని పేరు వచ్చి మరింత కీర్తి పెరిగింది. ఈ సంఘటనకు చిహ్నంగా ఇక్కడ 12 సంవత్సరములకు ఒకసారి కుంభమేళ జరుగుతుంది. ఈ క్షేత్రాన్ని సూర్యభగవానుడు అధికంగా సేవించటం వల్ల ఈ క్షేత్రానికి భాస్కరక్షేత్రం అని కూడా పేరు వచ్చింది. ఉత్తమ జ్ఞాన ప్రదాయిని అయిన సరస్వతి నదీ క్రమంగా భూమిలోకి ఇంకిపోయింది. అందువల్ల ఆ నదిని అంతర్వాహిని అని పిలుస్తారు. అందువల్లనే ప్రస్తుతం ప్రయాగ క్షేత్రంలో రెండు నదులే కనిపిస్తున్నప్పటికీ, అ సంగమాన్ని త్రివేణీ సంగమమనే అని పిలుస్తున్నారు. ఈ క్షేత్రం మీది గౌరవం వల్లే మన దేశంలో ఇతరత్ర రెండు నదులు ఎక్కడ కలసినా సరే మరో నది అంతర్వాహినిగా వుందని చెప్పేసి దాన్ని త్రివేణీగా వ్యవహరిస్తున్నారు. ఇది ప్రయాగ త్రివేణి పై గల అధిక గౌరవానికి ప్రతీకగా మనం స్వీకరించాలి.

ఈ క్షేత్రంలోనే సతీదేవి యొక్క చేతి వేలు ఒకటి పడటం చేత ఇక్కడ ఒక శక్తి పీఠం కూడా వెలసింది. దేవతలు, ఋషులు ఆ దేవిని మాధవేశ్వరీ అని కీర్తించారు. గంగానది నీరు స్ఫటికం లాగా తెల్లగా వుంటుంది. యమ పుత్రిక అయిన యమునా నది నీరు నాచులాగా నల్లగా వుంటుంది. ఆమె విష్ణు భక్తురాలు. అందువల్లనే విష్ణువు యొక్క రంగు ఆమెకు వచ్చింది. ఆమె విష్ణుపాదోద్భవి అయిన గంగలో కలిసిపోయే క్షేత్రం కనుక ఈ క్షేత్రానికి మాధవ క్షేత్రం అని కూడా వ్యవహారం వుండేది. అందువల్లనే ఇక్కడ వెలసిన శక్తి పీఠానికి మాధవేశ్వరి అని పేరు వచ్చింది.

ఈ దేవిని ప్రస్తుత స్థానికులు "అలోపి" దేవి అని కూడా పిలుస్తారు. ఈ క్షేత్రంలో అనాదిగా ఒక వట వృక్షం వుంది. ప్రస్తుతం అది అక్బరు నిర్మించిన కోటలో వుంది.

దీన్ని అక్షయ వటము అని పిలుస్తారు. ఈ వృక్షం విష్ణుమూర్తికి గొడుగు అని ప్రతీతి.

ఈ క్షేత్రంలో స్నానాలు చేసేవారు ముందుగా గంగలోనూ తరువాత యమునలోనూ, విడి విడిగా స్నానాలు చేసి, ఆ తరువాత సంగమంలో స్నానం చేస్తారు. ఈ సంగమంలో పురుషులు స్త్రీలు కూడా తమ తలనీలాలను నదీ దేవికి సమర్పిస్తారు. స్త్రీలు తమ జడ కొసలు మాత్రం కత్తిరించి నదిలో వేస్తారు.

దీనికి ఒక కారణం వుంది. ఈ సంగమంలో స్నానం చేసిన వారికి అన్ని పాపాలు శరీరంలోంచి బయటకు పోయి వారి జుట్టులో దూరి కూర్చుంటాయి. అందువల్ల ఇక్కడ కేశ ఖండనం అవశ్యంగా చేసుకోవాలని పురాణాలు నిర్ణయించాయి. అనంతరం పురుషులు తమ పితృదేవలకు పిండ ప్రదానం చేస్తారు. గయ తర్వాత పిండ ప్రదానానికి ప్రయాగే ముఖ్య క్షేత్రం. గంగా యమునల మధ్యలో గల భూభాగమంతా కూడా పరమ పవిత్రమైనదని మనం ప్రతి రోజూ చేసే సంధ్యా వందనంలోనే వుంది.

అందువల్లే గంగా యమునా మధ్య ప్రదేశం ఉత్తమ దేశమని వేదం కీర్తిస్తోంది. దూరాన వున్న వారైనా సరే ఈ క్షేత్రాన్ని ప్రతిరోజూ స్మరించి ఇక్కడి మృత్తికను వంటికి రాసుకుంటే ఈ తీర్థస్నాన ఫలితం లభిస్తుంది. ఈ క్షేత్రానికి ఈ రకమైన మహత్యమంతా రావటానికి మూల కారణం ఇక్కడి మాధవేశ్వరీ శక్తి పీఠమే.

శ్రీరాముడు ఆరణ్యవాసం చేస్తున్నపుడు భరద్వాజ మహర్షి ఈ క్షేత్రంలోనే నివసించేవాడు. అప్పటికి ఇది కేవలం కీకారణ్యం. శ్రీరాముడు భరద్వాజ మహర్షిని దర్శించి, ఇక్కడ మాధవేశ్వరీ శక్తిని సేవించాడు. ఆ తరువాత శతృఘ్నుడు లవణాసురుణ్ణి సంహరించి, యమునాతీరాన గల లవణ రాజ్యానికి రాజైన

తరువాత ఆ ప్రాంతాన్ని వృద్ధి చేయడంలో అతడు ప్రయాగ క్షేత్రాన్ని కూడా అభివృద్ధి చేశాడు. శ్రీకృష్ణుడి కాలం వచ్చేసరికి ప్రయాగ క్షేత్రం మహా నగరమైంది.

శ్రీవైష్ణవీ దేవి



## తుహినాద్రి స్థితామాతా - జ్వాలాముఖీతి విశ్రుతా

## జ్వాలా మాలా ప్రభాదేవీ - జ్ఞాన వైరాగ్య వర్థినీ

### 15. జ్వాలాయాం వైష్ణవీ దేవి

పఠాన్ కోట్ నుంచీ జోగేంద్రనగర్ వెళ్ళే దారిలో, జ్వాలాముఖీ రోడ్ అనే రైల్వే స్టేషన్ వుంది. అక్కడికి 20 కిలోమీటర్ల దూరంలో జ్వాలాముఖీ క్షేత్రం వుంది. ఇదే అష్టాదశ పీఠాలలోని జ్వాలా వైష్ణవీక్షేత్రం.

ఇక్కడ కాలధరమనే పర్వతం వుంది. ఈ పర్వతం మీద సతీదేవియొక్క జిహ్వా (నాలుక) నిలువుగా పడింది. ఆ క్షణం నుంచి ఇప్పటి వరకూ ఈ స్థానంలో అగ్ని జ్వాల బయటకు వస్తూనే వున్నది. ఈ అగ్ని జ్వాలనే జ్వాలాముఖీశ్వరీ దేవి అని, జ్వాలాజీ అని భక్తులు పిలుస్తున్నారు. శక్తిదేవి ప్రత్యక్షంగా జ్యోతిస్వరూపంతో వెలసిన ఏకైక క్షేత్రం ఇదే. జ్యోతిస్సు సర్వత్రా వ్యాపిస్తుంది. వ్యాపించే వస్తువును విష్ణువు అంటారు. అందుచేత ఈ దేవిని వైష్ణవీ అని కూడా మహర్షులు వ్యవహరించారు.

జ్వాలారూపంలో వున్న వైష్ణవి గనుక, జ్వాలా వైష్ణవి. ఇక్కడ ఒక చిన్న గుహాలయం వుంది. దీని ప్రవేశ ద్వారానికి ఎదురుగా 3 అడుగుల ఎత్తున ఒక గూడు వున్నది. ఆ గూటిలో సుమారు 6 అంగుళాల పొడవుగల అగ్ని జ్వాల వున్నది. ఈమెయే జ్వాలాముఖీ దేవి. ఈ దేవికి ఎదురుగా 3 అడుగుల చదరంలో, ఒక హెూమ కుండం వున్నది. దీనిలో అగ్ని నిరంతరం ప్రజ్వరిల్లుతూ వుంటుంది. జ్వాలా దేవికి సమర్పించే నైవేద్యాలన్నీ ఈ హెూమ కుండంలోనే సమం చేస్తారు. ఈ గర్భాలయానికి, ఎడమ పక్కన 4 అడుగుల లోతుగల జల ప్రవాహం ఒకటి ప్రవహిస్తూ వుంటుంది. జ్వాలా దేవి యొక్క గర్భగుడికి 2 అడుగుల చదరం గల ఒక చిన్న ప్రవేశ ద్వారం వుంది.

దానిలో నుంచీ తలదూర్చి లోపలికి చూస్తే, జ్వాలాదేవి బాగా దర్శనమవుతుంది. ఆ దేవి పక్కన 40 అడుగుల త్రిశూలం వుంది. ఈ జ్వాలా దేవి అడుగు భాగం మల్లెపూవులాగా తెల్లగా వుంటుంది. పై భాగం ఎర్రగా వుంటుంది. ద్వారం లోపలికి తలపెట్టి "రాధేశ్యామ్" అని మనం ఎంత పెద్దగా అరిస్తే లోపలి జ్వాల అంత పెద్దది అవుతుంది. వేరే ఏ ధ్వని చేసినా జ్వా ల పెరగదు. రాధేశ్యామ్ అన్నప్పుడు పెరగటం వల్ల కూడా ఈ దేవిని వైష్ణవి దేవి అంటున్నారు.

ఈ ఆలయంలో మరికొన్ని చోటులలో కూడా, ఇలాంటి జ్వాలలు వున్నాయి. కానీ. అవి రాధేశ్యాం అంటే పెరగవు. ఈ పర్వతం కింద సహజ వాయువులు, పెట్రోలియం పదార్థాలు, ఉన్నాయనీ, అందువల్లే ఈ జ్వాల ఇలా వస్తోందనీ, కొందరు భావిస్తూ వుంటారు. దానిపై అనేక పరిశోధనలు కూడా చేశారు. కానీ, అంతు దొరకటం లేదు.

ఒకప్పుడు అక్బరు చక్రవర్తి ఈ క్షేత్ర పూజను మూఢ నమ్మకంగా భావించి, ఈ జ్వాల వచ్చే చోటును ఇనుప రేకులతో మూయించి వేశాడు. అయినా జ్వాల ఆగలేదు. అక్కడితో ఆగక దగ్గరలో గల ఒక నీటి ఊటను దారి మళ్ళించి, ఈ జ్వాలమీదికి నిరంతరం ప్రవహించేటట్లు చేయించాడు. అయినా జ్వాల ఆగలేదు. ఇలా నీటిని మళ్ళించిన రోజున అక్కడి ఢిల్లీలో, అక్బరుకు కళ్ళు కనిపించటం మానేశాయి. దాంతో అక్బరు స్వయంగా వచ్చి, అమ్మవారికి పూజలు చేయించి, మొక్కులు మొక్కుకుని, కంటి చూపును పొందాడు. తన అపరాధానికి క్షమార్పణగా, అనాడు అక్బరు చేయించినట్లు పెద్ద వెండి గొడుగు, ఇప్పటికీ ఆలయంలో వుంది.

**శ్రీ మాంగళ్య గౌరీ దేవి**

సర్వమంగళ మాంగల్యా - గయా మాంగల్య గౌరికా

అర్థదా మోక్షదాదేవీ - అక్షయ్య వరదాయినీ

## 16. గయా మాంగల్య గౌరికా

ఫల్గునదీ తీరంలో కోలాహలమనే పర్వతం వుంది. దానిమీద గయుడనే రాక్షసుడు ఘోర తపస్సు చేయసాగాడు. ఇంద్రుడు భయపడిపోయి బ్రహ్మ దగ్గరకు వెళ్ళి ఈ తపస్సు మాన్పించమన్నాడు. వాడికి వరమిచ్చే శక్తి నాకు లేదన్నాడు. బ్రహ్మ ఆ తర్వాత శివుడూ అలాగే అన్నాడు. విష్ణువు మాత్రం కొంచెం ఆలోచించి, దేవతలను వెనక్కి పంపించేసి తాను స్వయంగా గయాసురుడి దగ్గరకు వెళ్ళి సమాధిలో వున్న గయాసురుడ్డి శంఖంతో ముట్టుకున్నాడు. గయాసురుడికి తెలివి వచ్చింది. ఎదురుకుండా విష్ణువుని చూశాడు. సాష్టాంగా వందనం చేసి అయ్యా మీరు ఎందుకు వచ్చారు అన్నాడు. నీకు వరమీయడానికి వచ్చాను. అన్నాడు విష్ణువు నాకు ఏ కోరికలూ లేవు అన్నాడు. గయుడు కాదు కోరుకోవల్సిందే అన్నాడు విష్ణువు.

అలా అయితే నన్ను తాకిన ప్రతి జీవికీ, చూసిన ప్రతి జీవికీ కూడా మోక్షం ఇవ్వండి అని కోరాడు గయుడు. విష్ణువు తథాస్తు అని వెళ్ళిపోయాడు. మొదట్లో ఇంద్రుడికి చాలా సంతోషం అయింది. కానీ క్రమంగా ఇంద్రుడికే కాక సమస్త దేవతలకీ వణుకు పుట్టసాగింది. ఏమంటే ఈ గయాసురుడుతన శరీరాన్ని కొన్ని వందల మైళ్ళు ఉండేటట్లుగా పెంచేసి నుంచుంటున్నాడు. దాంతో ఎక్కడెక్కడ జీవులు, పురుగులతో సహా వీర్న్ చూసి మోక్షం పొందుతున్నారు. అటు స్వర్గానికి గానీ, ఇటు నరకానికి గానీ, వచ్చే జీవే లేడు. ఇక తమకు రాజ్యం ఎందుకు ఉన్నట్టు? ఇదీ, ఇంద్రాదుల సమస్య. ఇది ఇలా వుండగా యమ ధర్మరాజుకు ధర్మవ్రత అనే కూతురు పుట్టింది. ఆమో బాగానే వుండేది. కానీ ఎందుకో ఆమె పెళ్ళికి ఏ సంబంధాలూ కుదిరేవు కావు. చివరికి యమధర్మరాజు విసిగి పోయి పెళ్ళికోసం తపస్సు చేయమ్మా! అన్నాడు.

ఆమె ఘోర తపస్సు ప్రారంభించింది. ఒకనాడు బ్రహ్మమానస పుత్రుడైన మరీచి మహర్షి దారిన పోతూ ఈమెను చూసి ఎందుకు తపస్సు చేస్తున్నావు అని అడిగాడు. పెళ్ళి కోసం అన్నది. అయితే నన్నే చేసుకో అన్నాడు. ఆ విషయం మా నాన్న గారితో మాట్లాడండి అన్నది ఆమె. మరీచి మహర్షి సరాసరి యమధర్మరాజు దగ్గరికి వెళ్ళి జరిగిన విషయం చెప్పాడు. యమధర్మరాజు చాలా సంతోషపడి వెంటనే పెళ్ళి చేశాడు.

ఒక రోజున ఎండలో ఎక్కడికో వెళ్లి వచ్చిన మరీచి మహర్షి అలసిపోయి, భార్య ఒడిలో తలపెట్టి నిద్ర పోయాడు. ఇంతలో అక్కడికి బ్రహ్మ దేవుడు వచ్చాడు. వచ్చింది మామగారు పైగా బ్రహ్మ భర్తకు ఒళ్ళు తెలియడం లేదు. తాను కదిలితే ఆయన లేస్తాడేమో, మామగారు వస్తే కొడుకూ, కోడలు కదలకుండా కూర్చుంటే అది ధర్మమా ! ధర్మవ్రత ఎటూ తేల్చుకోలేక పోయింది. చివరకు ఒక నిర్ణయానికి వచ్చి, భర్తకు మెలుకువ రాకుండా మెల్లగా తలకింద దిండు పెట్టి తను లేచి మామగారికి స్వాగతం చెప్పింది. బ్రహ్మదేవుడు ఈ పరిస్థితి చూసి నేను మళ్ళీ వస్తాలే అని వెళ్ళిపోయాడు.

కానీ ఇంతలోనే మరీచి మహర్షికి మెలుకువ వచ్చింది. లేస్తూనే ఆయన ఉగ్రుడై రెండోమాట వినిపించుకోకుండా, శిలవైపొమ్మని భార్యను శపించాడు. ధర్మవ్రత ఆ శాపానికి అంగీకరించలేదు. నాతప్పు లేదు. నేను ధర్మంగానే వ్యవహరించాను కనుక నీ శాపం తగలకుండా వుండేందుకు తపస్సు చేస్తానని వెంటనే తపస్సు లోకి దిగింది. ఇటు బ్రహ్మపుత్రుడి శాపశక్తి, అటు యమ పుత్రిక తపశ్శక్తి, రెండూ పోటీ పడ్డాయి. దేవతలు గడ గడలాడి విష్ణువు దగ్గరకు వెళ్ళారు.

విష్ణువు ధర్మవ్రతకు ప్రత్యక్షమై నచ్చ చెప్పాడు. అమ్మా! మహర్షి శాపం ఆపటం ఎవరి తరమూ కాదు. దాన్ని వేరే ఉపాయంతో దాటాలి. కనుక ఏదైనా ఉపాయం

ఆలోచించు అన్నాడు. ధర్మవ్రత ఆలోచించి ఇలా అంది. దేవా! నువ్వూ అసాధ్యం అంటుంటే, నేనేమి చెప్పేది? సరే! నేను శిలనే అవుతాను కానీ ఎప్పటికీ శిలగానే వుంటాను. శాపానికి పరిహారం వద్దే వద్దు. కానీ శిలనైన నామీద నీ పాదాలు నిత్యం వుంచు. నామీద ఉన్న నీ పాదాలను స్పృశించిన వారికి బ్రహ్మలోకం ప్రసాదించు. అంతే చాలు. విష్ణువు సరేనన్నాడు. యమధర్మరాజు అవుననలేక, కాదనలేక శిలగా మారిన కూతురిని, ఇంట్లోనే పెట్టుకున్నాడు. నేను ఇచ్చిన వరం చెల్లించే రోజు వస్తుంది లేవయ్యా అన్నాడు విష్ణువు. ఇది ఇలా వుండగా, గయాసుర దర్శనం వల్ల ఉత్పన్నమైన సమస్య, మరీ ఎక్కువై స్వర్గ నరకాలు రెండూ ఖాళీ అయిపోయినాయి.

దేవతలందరూ కలిసి విష్ణువు దగ్గరకు వెళ్ళారు. ఈ సారి విష్ణువు దేవతలను తీసుకొని బ్రహ్మ దగ్గరకు వెళ్ళాడు. విష్ణువు బ్రహ్మతో ఇలా చెప్పాడు. ఆయ్యా! వేరే ఉపాయం తోచటం లేదు. మీరు ఆ గయాసురుడి దగ్గరకు వెళ్ళి మీరు చేయబోయే మహాయజ్ఞానికి అతడి శరీరాన్ని వేదికగా ఇమ్మని యాచన చేయాలి. అతడు మహాపవిత్రుడు, ధర్మాత్ముడు, ఉదారుడు మీరు వెళ్ళి అడిగితే కాదనడు అని అన్నాడు.

బ్రహ్మ దేవుడు గయాసురుడి దగ్గరకు వెళ్ళి, తన శరీరాన్ని యజ్ఞ వేదికగా దానం చేయమని కోరాడు. బ్రహ్మగారు వచ్చి అడిగేసరికి పరమానంద పడిన గయాసురుడు శరీరమనేది ఎప్పటికైనా కాలిపోయేదే. దాన్ని మీరు యజ్ఞవేదిక చేస్తానంటే, నాకు అంతకన్నా కావల్సింది ఏముంది? అలాగే కానీండి అన్నాడు. అయ్యా! నీమీద యజ్ఞ కుండం పెట్టటమంటే నాకు పెద్ద ప్రమాదం ఎందుకంటే మధ్యలో నువ్వు కదిలావంటే, నా యజ్ఞం చెడిపోతుంది. అన్నాడు బ్రహ్మ. అయ్యా! ఒళ్ళు కాలుతుంటే దానంతటదే కదులుతుంది. కదలకుండా చూసుకొనే బాధ్యత మీదే. ఆ ఏర్పాట్లు మీరే చేసుకోండి అన్నాడు గయుడు.

గయుణ్ణి పడుకోమన్నాడు. తల కోలాహ పర్వతం పక్కకు వచ్చింది. అతడి పాదాలు ఆంధ్రదేశంలోని పిఠాపుర క్షేత్రానికి వచ్చాయి. అంత పొడుగూ, దానికి తగ్గ లావూ

వున్నది అతడి శరీరం. బ్రహ్మ దేవుడు ఆ మహాత్ముడి వక్షస్థలం మొత్తాన్ని అగ్ని కుండం చేసి, దాని నిండా కట్టెలు వేసి, బ్రహ్మాండంగా యజ్ఞం చేయసాగాడు.

రాను రానూ ఆ వేడి దుర్భరమై గయాసురుడు అప్రయత్నంగానే కదలసాగాడు. అప్పుడు బ్రహ్మ దేవుడు యముడ్ని పిలిచి ఆయన యింట్లో వున్న పెద్ద ధర్మశిలను తెచ్చి, గయుడి శిరస్సు మీద పెట్టమన్నాడు. యముడు అలా చేసినా కూడా గయుడు ఇంకా కదులుతూనే ఉన్నాడు. అపుడు బ్రహ్మదేవుడు ఆలోచించి, ఆ ధర్మశిల మీదకి విష్ణువును ఆవాహన చేశాడు.

వెంటనే విష్ణువు సర్వదేవతా సమన్వితుడై వచ్చి ధర్మశిలపై నిబడ్డాడు. ఆ బరువుకి గయుడు ఇక కదలలేక పోయాడు. ఇలా జరిగినా కూడా అగ్ని బాధనూ, విష్ణు బాధనూ, సంతోషంగా అనుభవిసూవున్న గయాసురుణ్ణి చూసి విష్ణువు అనందించి ఏదైనా వరం కోరుకోమన్నాడు.

పూర్వం నాకు కోరికలు లేవన్న గయుడు ఈ మాటు పూర్తిగా వినీతుడై ఇలా కోరుకున్నాడు. దేవా! నాకు కోరికలు లేవు. నిజమే కానీ. నీవు ఏర్పరచిన కర్మ సూత్రాలకు భిన్నంగా అందరికీ మోక్షం రప్పించాలనే నా కోరికలో వున్న తప్పు నాకిప్పుడు తెలిసింది. కానీ దేవా! ఈ శరీరం బ్రహ్మ యజ్ఞం చేత పవిత్రమైంది. దానికి మించి ఈ ధర్మశిల, దానికి మించి ఆ శిలపై నీ పాదాలు లోకోత్తరంగా వున్నాయి. దేవా! నా తలపై నీ పాదాలు ఇలాగే శాశ్వతంగా ఉండనీ! ఈ శిల బరువుకీ నేను ఏలాగూ భూమిలోకి పోతాను. ప్రజలు నన్ను చూడరు. కానీ, నా తలపై నిలిచిన నీ పాదాలను చూసిన వారికి ఉత్తమ గతి కలుగు గాక! ఈ నీ పాదక్షేత్రాన్ని నా పేరు మీదుగా స్మరిస్తూ ఇక్కడే కాదు. ఎక్కడ పిండ ప్రదానం చేసినా సరే! ఆ వంశం వృద్ధి చెందుగాక! ఈ ఫల్గుననదిలో సమస్త తీర్థాలసారం చేరుగాక! దేవా! నాకు ఆయుష్యం తీరగానే మరో జన్మ లేక, మోక్షం లభించుగాక! అని కోరుకోగా, విష్ణువు అనందంగా తథాస్తూ అన్నాడు. అప్పటి నుంచి గయా క్షేత్రం పిండ ప్రదాన క్షేత్రమై ప్రసిద్ధి కెక్కింది.

ఇది ఇలా ఉండగా, సతీదేవి యొక్క శరీర ఖండం ఒకటి ఇక్కడ పడి, ఒక శక్తి పీఠం ఏర్పడింది. సర్వమంగళాలను ప్రసాదించే ఈ తేజోమూర్తిని చూసి దేవతలు, మునులు ఈమెను సర్వమంగళా దేవి అని కీర్తించారు.

ఈ క్షేత్రంలో ఫల్గుణీ, మధుర, శ్వేత అనే 3 నదులు సంగమిస్తూ వుండటం వల్ల ఈ క్షేత్రానికి ప్రయాగ క్షేత్రంతో సమానమైన ఫలం కూడా ఏర్పడుతుంది. అయితే కాలచక్రమంలో, ఫల్గుననది ఎండిపోయి అంతర్వాహిని అయిపోయింది. ప్రస్తుతం మధుర, శ్వేత నదులు మాత్రమే ఇక్కడ కనిపిస్తున్నాయి.

గయాసురుడి శిరస్సు వున్న ఈ విష్ణు గయకు శిరో గయా అని, పాదాలువున్న పీఠాపుర క్షేత్రానికి పాదగయా అని పేర్లు వచ్చాయి. విష్ణుమూర్తి శిరోగయలో నిలిచిన కొంతకాలానికి, ఒక రాక్షసుడు ఆ ప్రాంతాలలోనే ఘోరంగా తపస్సు చేయసాగాడు. స్వయంగా దేవేంద్రుడు వాడికి వరం ఇవ్వడానికి వెళ్ళాడు. వాడు ఇప్పటి వరకూ ముల్లోకాలలోవున్న ఏ ఆయుధంతోనూ నేను చావటానికి వీలు లేదు అని వరం కోరాడు. ఇంద్రుడికి తథాస్తు అన్నాడు.

మహా శక్తిపీఠాలు దాంతో త్రిమూర్తుల ఆయుధాలతో పాటు యముడి కాలదండం కూడా వాడి పట్ల నిర్వీర్యమే అయిపోయింది. దాంతో వాడు తనకు వరాలు ఇచ్చిన ఇంద్రుణ్ణి కిందకు లాగి, తాను స్వర్గ సింహాసనం అధిష్టించాడు. దేవతలు గయలో వున్న విష్ణుమూర్తిని ప్రార్థించారు.

ఆయన విశ్వకర్మను పిలిచి ఏదైనా కొత్త ఆయుధం తయారు చేయమని అడిగాడు. వజ్రం వంటి ఒకానొక ఎముకతో, గద అనే కొత్త ఆయుధాన్ని తయారు చేశాడు. శ్రీహరి సంతోషించి, ఆ గదతో ఆ రాక్షసుడి తలను చితక గొట్టి సంహారం చేశాడు.

రక్తసిక్తమైన ఆ గదను శ్రీహరి ప్రక్షాళన చేసిన ఫల్గుననది సంగమ తీర్థానికి గదాలోల తీర్థమని పేరు వచ్చింది. ప్ర ప్రథమంగా గదను ధరించిన స్వామి గనుక గయలోని స్వామికి గదాధరస్వామి అని పేరు వచ్చింది.

బుద్ధుడు ఇల్లు విడిచి వెళ్ళాక తపస్సు చేత సిద్ధి పొందిన రావి చెట్టు ఈ క్షేత్రానికి ఆనుకొనే వుంది. దాన్ని బోధివృక్షము అని పిలుస్తున్నారు. ఆ ప్రాంతంలో వృద్ధి చెందిన నగరాన్ని బుద్ధ గయ అని పిలుస్తున్నారు. అక్కడ పెద్ద బుద్ధాలయం వుంది. ఇక్కడ క్షేత్రంలో సుమారు 50 రకాల వివిధ శ్రాద్ధాలు, దానాలు చేయాలని శాస్త్రాలు చెపుతున్నాయి. అంత చేతకాక పోయినా, జన్మకు ఒక్కసారైనా పితృదేవతలకు గయలో పిండాలు సమర్పించటం, పుత్రులకు విధి. దాని వల్ల ఆ పితృదేవతలకు అక్షయ తృప్తి, శాశ్వత బ్రహ్మలోక నివాసం లభిస్తాయి.

ఇక్కడ గల సర్వమంగళాదేవి ఈ క్షేత్రాన్ని సేవించే వారిని, వారి పితృతేవతలనూ కూడా నిత్యమూ అనుగ్రహిస్తూనే వుంటుంది. కొందరు ఈ దేవి గయ నుంచి కాశీ వెళ్ళే దారిలో బ్రహ్మ యోని పర్వతం మీద వుందంటున్నారు. పంచగయా క్షేత్రములు అవి 5 క్షేత్రాలు ఉన్నాయి. అవి

**1. గయ : బీహర్ రాష్ట్రంలో ఫల్గుణి (శిరోగమ) నదీ తీరంలో వుంది.**

**2. జాజాపూర్ : ఒరిస్సా రాష్ట్రంలో (నాభిగయ) వైతరణీ నదీ తీరంలో వుంది. దీనికి నాభిగయ అని పేరు.**

**3. పిఠాపురం : ఆంధ్రప్రదేశ్ లో మహాపాద గయ సరోవర తీరంలో దీనికి పాదగయ**

అనిపేరు.

**4. సిద్ధపూర్ : గుజరాత్ రాష్ట్రంలో (మాతృగయ) మహేషన జిల్లాలో సరస్వతీ నదీ తీరంలో వుంది. దీనికి మాతృగయ అని పేరు. దీనినే బిందు సరోవరమని వ్యవహరిస్తారు. అహమ్మదాబాదుకు 32కి.మీ.దూరం, ఇక్కడ మాతృవంశం వారికి పిండ ప్రదానం మరింత ముఖ్యం. ఒరిస్సాలో భువనేశ్వర్ కి 33 కి.మీ రూరంలో వున్న సరోవరమే బిందు సరోవరమని కొందరంటారు. ఇక్కడ కూడా పిండ ప్రదానాలు చేస్తారు.**

**5. బదరీనాథ్ : ఉత్తర ప్రదేశ్ అలకనందా నది తీరంలో బ్రహ్మ కపాలం అనేచోట మరొక గయ ఉన్నది. దీనిని కూడా పితృగయ అని పిలుస్తారు.**

శ్రీ విశాలాక్షీ దేవి

**విశాలాక్షీతి విఖ్యాత - వారణాస్యాం శివపార్శ్వే**

**నిరతాన్న ప్రదాత్రీచ - నిర్భాగ్య జనతోషిణీ**

## 17. వారణాస్యాం విశాలాక్షీ

శ్రీ కాశీ క్షేత్రం సృష్టి అదిగా శివ నివాస స్థానం. శివునికి కైలాసంకన్నా ప్రియమైన స్థానం. ఒకానొకప్పుడు భూలోకమంతా చెడ్డ రాజుల చేతులలో పడి ఆధర్మంతో నిండిపోయింది. అప్పుడు బ్రహ్మదేవుడు కాశీ క్షేత్రంలో తపస్సులో మునిగి వున్న దివోదాసు అనే క్షత్రియుణ్ణి పిలిచి. అతనిని తపస్సు మాని రాజ్యం చేయమన్నాడు.

దివోదాసు బ్రహ్మమాట కాదనలేక అంగీకరిస్తూ తాను రాజ్యం చేయ్యాలంటే దేవతలంతా భూమిని విడిచా పెట్టి వెళ్ళిపోవాలని షరతు పెట్టాడు. ఆ షరతుకి లోబడి శివుడు కూడా కాశీ వదిలి వెళ్ళిపోవలసి వచ్చింది

దివోదాసు కాశీని రాజధానిగా చేసుకొని, తానే సమస్త దేవతా రూపాలు స్వీకరించి, అద్భుతంగా రాజ్యం చేయసాగాడు. శివుడు మాత్రం కాశీ వియోగం భరించలేక తిరిగి కాశీ క్షేత్రం చేరాలని బాలా ప్రయత్నాలు చేసి విఫలుడు, అయ్యాడు. చాలా వేల సంవత్సరాలు గడిచాక శివుడు గణేశుని కాశీకి పంపగా, ఆయన దివోదాసుకు వైరాగ్యం కలిగించి, భక్తి పుట్టించి ఈతని చేతనే శివుణ్ణి ఆహ్వానింప చేశాడు. దివోదాసు శివుణ్ణి ఆహ్వానించాడు.

అతని ఆహ్వానాన్ని మన్నించి శివుడు మహానందభరితుడై సమస్త పరివార సమేతుడై శివుడు కాశీకి విచ్చేశాడు. ఆ సమయంలో శివుని ఆనందం చూచి

ఆశ్చర్యపోయిన గౌరీమాత, కనులు పెద్దవి చేసుకొని కాశీలో ప్రవేశించి మహాశక్తి స్వరూపిణిగా కాశీ విశ్వేశ్వరుని సన్నిధిలో నిలిచింది. అలా పెద్దకళ్ళు పెట్టుకిని తిలకిస్తున్న ఆమెనే దేవతలంతా విశాలాక్షీ అని పిలిచి స్తుతించారు.

కాశీమహాక్షేత్రంలో గల ఈ తల్లి అష్టాదశ శక్తి పీఠాలలో ఒకటిగా అయింది. ఆ తర్వాత కొంతకాలానికి కైలాసంలో శివుడు తన రెండు నేత్రాలలో సూర్యచంద్రుల ద్వారా జగత్తులోని జీవులకు సస్యసంపదలను అందిస్తుండగా, గౌరీదేవి వెనకాల నుండి వచ్చి, ఆయన రెండు కళ్ళుమూసింది. దిగంబర యోగినీమాన రక్షణార్థం అలా చేసింది. కైలాసంలో కొద్ది క్షణాలు భూలోకంలో అనేక యుగాలు కావటం వలన, ఇక్కడ అనేక జీవులు నశించారు. ఆ పాపం వలన గౌరీదేవి శరీరం నల్లగా మాడిపోయింది. అమో తన తప్పు తెలుసుకొని తనకు ప్రాయశ్చిత్తం ఉపదేశించమని శివుని ప్రార్థించింది. శివుడామెను కాశీకి వెళ్ళి అక్కడ అన్నదాన రూపమైన తపస్సు చేయమని ఆదేశించాడు. అందుకే గౌరీదేవి మళ్ళీ మరో రూపంతో కాశీమహాక్షేత్రానికి చేరి, చేతిలో బంగారు గరిట ధరించి రాత్రిబవళ్ళు కాశీవాసులకు నిరంతరం అన్నదానం చేయసాగింది. ఇలా అనేక యుగాలు గడిచిపోయాయి. ప్రజలంతా ఆమెను అన్నపూర్ణ అని పిలవసాగారు. క్రమంగా ఆమె శరీరం బంగారుకన్నా అధికంగా మెరిసిపోసాగింది. ఆమె ఇక కాశీని వదిలి పెట్టలేక ఒక అంశతో అక్కడే సిద్ధంగా ఉండిపోయింది. మరోక అంశతో కాంచీపురానికి వెళ్ళి అక్కడ కామాక్షీదేవిగా నిలిచింది.

ఇలా ఉండగా, ఒకసారి వ్యాసమహర్షి చాలామంది శిష్యులతో కలిసి ఎంతో ఆర్భాటంగా కాశీయాత్రకు వచ్చాడు. శివుడు ఆయనను పరీక్షించదలచటం వలన, వారం రోజులైనా ఆయనకు అన్నం మెతుకు దొరకలేదు. చివరకు ఆకలికి తట్టుకోలేక వ్యాసుడు మహోగ్రుడై కాశీవాసులందరినీ శపిస్తానని చేతిలోకి నీరు తీసుకున్నాడు. వెనువెంటనే అన్నపూర్ణాదేవి వృద్ధాంగన స్వరూపంతో వ్యాసునికి దర్శనమిచ్చి భోజనానికి రమ్మని పిలిచింది. ఆకలి బాధలో వ్యాసుడు "నేను ఒక్కడినే వచ్చేదా? శిష్యులనుకూడా తెచ్చేదా? అని అడిగాడు. ఆమె అందరినీ రమ్మంది.

సరేనని వ్యాసుడు ఆమె ఇంట్లోకి వెళ్ళి చూస్తే ఎక్కడా వంట ప్రయత్నమూ లేదు. వ్యాసుడికి కంగారుగా వుంది. ‘‘నీకెందుకు నాయనా? స్నానం, అనుష్ఠానం పూర్తిచేసుకో’’ అన్నది వృద్ధాంగన. అన్నట్లుగానే అందరికీ పంచభక్ష్య పరమాన్నాలతో

భోజనాలు పెట్టింది. వ్యాసుడు అన్నం తిని ఆశ్చర్యంగా చూస్తుండగానే ఆ ఇల్లు శివ సభగా మారిపోయింది. సింహాసనంలో శివుని ప్రక్కన వృద్ధాంగన కూర్చుని ఉన్నది. శివుడు మహోగ్రంగా ఉన్నాడు. "ఓ వ్యాసా! నీవు విద్యా తపో గర్వం వలన కాశీనే శపించటానికి పూనుకొన్నావు కనుక నీకిక కాశీలో స్థానం లేదు’’ అని శివుడు వ్యాసుని కాశీ నుంచి బహిష్కరించేశాడు.

వ్యాసుడు శివుడి పాదాలపై పడి ఆయన అనుమతితో గంగకు అవతల వ్యాస కాశీని నిర్మించుకొని అక్కడ తపస్సు చేయసాగాడు. ఇలా కాశీలో తరతరాలుగా విశాలాక్షీ దేవిని శక్తిపీఠ దేవతగా పూజలందుకుంటూ వుంది.

# శ్రీ సరస్వతీ దేవి

జ్ఞాన ప్రదా సతీమాత - కాశ్మీరేతు సరస్వతి

మహావిద్యా మహామాయా - భుక్తి ముక్తి ప్రదాయిని

18. శ్రీ సరస్వతీదేవి - కాశ్మీరు

శివ పార్వతుల వివాహం అయినాక నవదంపతులు ఇద్దరూ చాలా కాలం హిమాలయ శిఖరాలలో విహరిస్తూ కాలక్షేపం చేశారు. వారికి ఇద్దరు పిల్లలు కూడా పుట్టారు. పిల్లలు పెరుగుతున్నకొద్దీ, పార్వతీదేవికి, తనకు ఒక ఇల్లు కావాలని గట్టిగా అనిపించ సాగింది. దీనికి తోడు ఒకనాడు నారద మహర్షి వచ్చి వైకుంఠంలో విష్ణు భవనం యొక్క సౌందర్యాన్ని, బ్రహ్మలోకంలో బ్రహ్మ భవనం యొక్క సౌందర్యాన్ని ఘనంగా వర్ణించి వెళ్ళాడు. దాంతో తమకు అంతకు మించిన భవనం కావల్సిందే అని పార్వతి పట్టుపట్టింది. శివుడు ఎంత చెప్పినా వినలేదు.

విశ్వకర్మ "సదే" నని ''ఎక్కడ కట్టమన్నా''రని అడిగాడు. శివుడు పార్వతినే చెప్పమన్నాడు. పార్వతి ఆలోచించుకొని ''నా భవనం మా నాన్న భవనం కన్నా పెద్దదిగా వుండాలి. అంతచోటు ఈ ప్రాంతాలలో ఎక్కడా లేదు. అందువల్ల దక్షిణ సముద్రం మధ్యలో పెద్ద దీవిని ఏర్పరచి, ఒక రాజ్యమంత ఇల్లు కట్టు'' అన్నది.

విశ్వకర్మ ''సరే'' అని సముద్రంలో లంకా పట్టణ నిర్మాణం చేశాడు. దాన్ని చూసి దేవతలే అసూయ పడ్డారు. పార్వతీ దేవి చాలా సంతోషపడ్డది. ఇక గృహప్రవేశం చేయాలి. దానికి బ్రహ్మత్వం ఎవరికి ఇవ్వాలి? అని చర్చ వచ్చింది. ఇంతలో రావణాసురుడి తపస్సు తీవ్రమై, అతడి పిలుపులు కైలాసంలో వినిపించసాగాయి. సంతోషంలో వున్న పార్వతి దేవి చాలా జాలిపడి ''అతణ్ణి పిలిపించి వరాలి'' మ్మని శివుణ్ణి ప్రార్థించింది. శివుడు "అలాగే" నని రావణాసురుణ్ణి పిలిపించాడు. చాలా కాలంగా తపస్సు చేస్తున్నందు వల్ల మంచి తాపసి వేషంలో వుండి బ్రహ్మ వర్చస్సు

తొణికిసలాడుతున్న రావణాసురుణ్ణి చూసే సరికి పార్వతీదేవికి చాలా సంతోషమై ''ఇతడు బ్రహ్మ దేవుడి మునుమడు కదా! పులస్త్య బ్రహ్మ పుత్రుడు కదా! ఇతడే మనకు బ్రహ్మత్వం వహిస్తే బావుండు కదా!'' అన్నది. శివుడు " నీ యిష్ట ప్రకారమే కానీ''! అన్నాడు. ''శివ పార్వతులకే బ్రహ్మనవుతున్నాను'' అనే సంతోషంలో రావణుడు ఒప్పుకున్నాడు.

గృహ ప్రవేశం చాలా బ్రహ్మాండంగా చేయించాడు. నాలుగు వేదాల మంత్రాలతో శాస్త్రోక్తంగా నిర్వహించాడు. లంకాభవనంలోని ప్రతి గదిలోనూ, సంప్రోక్షణలు చేయించాడు. ఆ భవన సౌందర్యం చూస్తున్న కొద్దీ, రావణాసురుడికి తలతిరిగిపోతున్నది. గృహ ప్రవేశం పూర్తి అయింది. పార్వతీ దేవి ఆనందానికి మేర లేదు. అతిథుల భోజనాలన్నీ అయినాయి. చివరికి బ్రహ్మత్వ దక్షిణా సమయం వచ్చింది. ఆనందం పట్టలేకుండా వున్న పార్వతి రావణాసురుణ్ణి చూసి ''నీకు దక్షిణ ఏమి కావాలో కోరుకో నాయనా! కాదనకుండా ఇస్తాను'' అన్నది. రావణాసురుడు అనుమానంగా శివుడి వంక చూశాడు. శివుడు ''ధర్మశాస్త్ర ప్రకారం బ్రాహ్మణుడు నాకింత దక్షిణ కావాలని కోరకూడదు'' అన్నాడు.

కానీ, పార్వతి ''నేను కొరుకోమన్నాను గనుక తప్పులేదు'' అన్నది. ''నీయిష్టం'' అన్నాడు శివుడు. రావణాసురుడిలోని రాక్షసత్వం పది తలలలోనూ ఒక్కసారిగా విజృంభించింది. "అమ్మా! మాట ఇచ్చావు. ఈ లంకా భవనమే నాకు దక్షిణగా కావాలని కోరుకుంటున్నాను. ఆపైన నీదయ'' అన్నాడు. పార్వతీదేవి కుప్పకూలి పోయింది. కానీ ఆడిన మాట తప్పడం ఇష్టం లేక ఆ భవనాన్ని దక్షిణగా ధారాదత్తం చేసింది. ఇక ఆ దుఃఖం ఆపుకోలేక పార్వతీదేవి వెంటనే హిమాలయాల పర్వతం దగ్గరికి వచ్చేసింది. ఆమె అలా ఉగ్రంగా వెళుతుంటే దేవతలంతా భయపడి బ్రహ్మను ప్రార్థించారు. ''నీ మనుమడి వల్ల ఇంత పని జరిగింది.'' అన్నారు. బ్రహ్మదేవుడు ఈ సమయంలో తను వెళ్ళటం బావుండదని సరస్వతీ దేవిని పంపాడు.

సరస్వతీ దేవి బయలు దేరి ఉగ్రంగా వస్తున్న పార్వతీ దేవిని కశ్మీర రాష్ట్రంలో కలుసుకుంది. కలుసుకొని అనేక రకాలుగా శాంతి వచనాలు పలికింది. పార్వతీ దేవి కక్కలేక, మింగలేక ''ఇన్ని శాంతి వచనాలు అక్కరలేదు లేవమ్మా! నీ చిలక పలుకలు ఆపు. నీవు ఇక్కడే వుండిపో! నేను ఎవనరిమీదా కోపగించనులే'' అనేసి కైలాసానికి వెళ్ళిపోయింది. పార్వతీదేవి మాట మీద గౌరవంతో సరస్వతీ దేవి అప్పటినుంచీ ఒక అంశతో అక్కడే వుండి పోయింది. మునులంతా ఆమెను కాశ్మీర సరస్వతీ అని కీర్తిస్తూ, సేవించుకో సాగారు. చిలక పలుకలు పలికిన ఆ తల్లిని, ఆ స్థానికులు ''శారికా దేవీ'' అని కీర్తించారు. ఇప్పటికీ కాశ్మీర రాష్ట్రంలో శారికాదేవి ఆలయం భక్తులకు విద్యనూ, సుందరమైన వాక్కునూ, జ్ఞానాన్ని ప్రసాదిస్తూ వున్నది. కొందరు కాశ్మీరులోగల శంకరాచార్య మఠంలోనే ఈ దేవి వున్నదంటున్నారు.

###

## 52 ఉప శక్తిపీఠాలు

### పశ్చిమ బెంగాల్ లోని శక్తి పీఠాలు

### 1. బహుళా క్షేత్రంలోని బహుళాదేవి

పశ్చిమ బెంగాల్ లో బర్డ్ వాన్ జాల్లా కటువా సమీపంలో అజయ్ నదీతీరంలో బహుళ త్రం ఉంది. కటువా రైల్వేస్టేషన్ నుండి కేతుగామ్ ద్వారా ఇచ్చటికి చేరవచ్చు. దాక్షాయణి దేహాన్ని విష్ణువు ఖండించి విసిరి వేసినప్పుడు దేవి ఎడమచేయి ఇచ్చ

పడిందని ఐతిహ్యం. ఇచటి దేవి బహుళామాతగా పూజలందుకొంటున్నది. ఇచ్చటి శివుని 'భరక్'గా పూజిస్తారు. ఆ 'భరక్' అనగా సర్వసిద్ధిప్రదాత అని అర్థం.

## 2. తిస్రోటలోని భ్రామరీదేవి

ఈ క్షేత్రం పశ్యిమబెంగాల్ చివరనున్న జల్పాయ్ గురికి చెందిన బోడా ప్రాంతంలోని పాల్ భాదిగ్రామంలో తిరస్తానదీ తీరంలో ఉంది. ఇచ్చట దేవి ఎడమకాలు పడిందని చెబుతారు. ఇచ్చటి దేవిని 'భ్రమరీ' అని శివుడిని 'అంబర' లేదా 'ఈశ్వరా' అని పూజిస్తారు. కొన్ని మూలాలనుబట్టి భ్రమరీ దేవాలయం బంగ్లాదేశ్ దాజధాని ఢాకా సమీపంలోని పాంఘర్ నుండి దాదాపు 344 కిలోమీటర్ల దూరంలో ఉంది. మరికొందరు పేర్కొన్నట్లు జల్పాయ్ గురి నగర సమీపంలోని జలేశ్వర దేవాలయ సమీపంలో ఈ ఆలయం ఉంది.

## 3. ఉచానిలోని మంగళ చండిక

బర్నాన్ జిల్లా ఉచాచి అనేచోట దేవి కుడిమణి కుట్టు పడిందని పురాణంలో వర్ణించబడింది. ఉచాచి గుస్కార్ రైల్వేస్టేషన్ నుండి సుమారు 16 కి.మీ దూరంలో ఉంది. బస్సు సౌకర్యం ఉంది. ఇచ్చట దేవి మంగళచండిక అన్న పేరుతో వెలసింది. ఇచ్చట శివుడు, కపిలవర్ణ వస్త్రధారియై ఉన్నందున కపిలాంబర అన్న పేరుతో పిలువబడుతాడు. ఈ దేవి దర్శనం శుభప్రదమని దేవిభక్తులు విశ్వసిస్తారు.

## 4. క్షీరగ్రామ్ యోగాద్యా దేవి

ఈ క్షేత్రం బర్ద్ నాన్ జిల్లా ఖీర్ గ్రామ సమీపంలో ఉంది. డర్ద్ నాన్ రైల్వే స్టేషన్ నుండి నిగమ్ చేరిన తరువాత అక్కడి నుండి ఖీర్ గ్రామ్ 2 కిలోమీటర్ల దూరంలో ఉంది. ఇచ్చట దేవి కుడిగాలి బొటనవేలు పడిందని ఐతిహ్యం .

యోగాద్యా లేదా జెగాద్యా, జోగదాయ అని ఈమెను పిలుస్తారు. ఇచ్చటి శివుని క్షీరఖండక అంటారు. ఇచ్చటి ఐతిహ్యం ప్రకారం దేవి పక్కనున్న సరస్సులో ఉండి, సంక్రాంతి, వైశాఖమాసంలో మాత్రం వెలికి వచ్చి భక్తులచేత పూజలందుకొని మరల సరస్సులో చేరుతుందని విశ్వసిస్తారు. (మన ప్రాంతంలో గౌరీ, గణేశ విసర్జనవలె) లోగడ ఇచ్చట నరబలి జరిగేదట. ఇప్పుడు జంతుబలి మాత్రం ఉంది.

ఈ దేవాలయాన్ని రాజా కీర్తిచంద్ర సుమారు 1770లో నిర్మించాడు. వైశాఖ, సంక్రాంతినాడు ఇక్కడ గొప్ప జాతర జరుగుతుంది. ఆ సందర్భంగా స్థానికులు ఎక్కువ మంది ఉంటారు. పర్యాటకులకు ఖీర్ గ్రాంలో వసతి సౌకర్యం ఉంది.

## 5. కోల్కతాలోని కాళికాదేవి

నాలుగు ఖండపీఠాలలో కోల్ కత్తాలోని కాళికాదేవి ఆలయం సుప్రసిద్ధమైనది. కోల్కత్తా నగరం నుండి కొన్ని కిలోమీటర్ల రూరంలో ఉన్న ఈ క్షేత్రానికి చేరేందుకు బస్ సౌకర్యం, ప్రైవేట్ వాహనాలు సులువుగా అందుబాటులో ఉంటాయి. హౌరా రైల్వే స్టేషన్, కాళీ ఘాట్ మెట్రో సమీపంలోనే ఉన్నాయి. నేలమట్టం దిగువనున్న దేవి విగ్రహం ఎత్తుగా వుంటుంది. ఇప్పటికీ చాలా సమీపంలోనే ఉండి దేవిని దర్శించవచ్చు. ఈ స్థల ప్రశస్తికి ప్రధాన కారణం రామకృష్ణ పరమహంస. వీరి ఆరాధ్యదైవమీ కాళికామాత.

15వ శతాబ్దినాటి సంస్కృత సాహిత్యలో కాళీఘాట్ ప్రస్తావన ఉంది. మూల దేవాలయసమీపంలోని ఒక గుడిసెలో ఈ దేవి ఉండేది. ప్రస్తుత దేవాలయం సబర్న్ రాయ్ చౌధురి కుటుంబం వారు నిర్మించినది. (1809) ప్రస్తుతమున్న విగ్రహం బ్రహ్మానందగిరి, ఆత్మానందగిరి అన్న సాధువుల కానుక. ఈ విగ్రహం పద్మావతీదేవిదని కాళికుండ సరోవరంలో దొరికి నందువల్ల ఈ స్థలం ప్రశస్తినందుకొన్నట్లు చెబుతారు.

లోగడ వ్యాపారులు ఇచ్చట విశ్రమించి హుగ్లీ నదిలో స్నానం చేసి, దేవిని పూజించి ముందుకు వెళ్ళేవారట. కాలక్రమంలో ఈ దేవాలయానికి గొప్ప పేరువచ్చింది.

కోల్ కత్తాలో ఉన్నది సౌమ్య కాళికాదేవి, రామకృష్ణ పరమహంస ఉపాసనా దైవంగా కొలిచిన, ఆ దేవి దేవాలయం సమీపంలో మరో ఉగ్రకాళీ ఆలయం ఉంది. ఇక్కడ వారానికి ఒకసారి నూరు గొర్రెలను బలిగా ఇస్తుంటారు. ఇచ్చట కాళీమాత కుడికాలివేళ్ళు పడినాయంటున్నాయి పురాణాలు. కాళికాదేవి పేరుకు తగినట్లు నల్లరంగులో ఉగ్రరూపిణిగా ఈ దేవి దర్శనమిస్తుంది. ఇచ్చటి శివుని 'నకులేశ' అంటూ పూజిస్తారు. ఈ ఆలయ సమీపంలోనే 12 శివాలయాలు ఉన్నాయి.

## 6. కిరీటికోన విమలాదేవి

ఈ క్షేత్రం పశ్చిమబెంగాల్ లోని ముర్షిరాబాద్ జిల్లాబాగ్ కోర్టురోడ్ రైల్వే స్టేషన్ నుండి 3కి.మీ దూరంలో ఉంది. ఆజీమ్ గంజ్ నుండి రైలు ద్వారా ఈ క్షేత్రానికి వెళ్ళవచ్చు. ఇచ్చట దేవి కిరీటం పడిందని నమ్మకం. ఈ దేవికి కిరీటేశ్వరి లేదా విమలాదేవి అన్న పేర్లు ఉన్నాయి. ఇచటి శివుడు 'భైరవ' లేదా 'సంవర్త' అన్న పేర్లతో పూజలందుకొంటున్నాడు. ఇక్కడ దేవి విగ్రహం లేదు. ఎర్రరంగు చీరకొక దానిని దేవి

అని పూజిస్తారు. పూర్వం వున్న దేవాలయాన్ని అక్బర్ చక్రవర్తి కట్టించినట్లు చరిత్ర చెబుతున్నది.

దాదాపు 18వ శతాబ్దంలో అనేకమంది ఋషులు, మునులు ఇక్కడ సాధనలు చేసేవారని చెబుతారు. ఆ దేశమేలిన రాజు వల్లభుని మీర్ జాఫర్ హత్య చేసినపుడు ఇచటి శివలింగం తనకు తానుగ చీలిపోయిందట. మీజాఫర్ మరణం సమీపించినపుడు మాత కిరీటేశ్వరి పాదోదకాన్ని సేవించి కన్నుమూశాడట.

## 7. కంకాలితాల్లోని గర్భాదేవి (కంకాలేశ్వరి)

పశ్చిమ బెంగాల్ బీర్ భూమ్ జిల్లా బోల్ పూర్ రైల్వేస్టేషన్ నుండి 10 కి.మీ దూరంలో ఉందీ శక్తిపీఠం. ఇచట దేవి దేహంలోని ఎముకపడిందని నమ్మకం. దేవిని 'దేవగర్భా' అని, ఇచ్చటి శివుని 'రురు' అన్న పేరుతో పూజిస్తారు. స్థానికులు దేవిని 'కంకాళేశ్వరి' అని పిలుస్తారు. ఈ శక్తిపీఠం గురించి భిన్నాభిప్రాయాలున్నాయి. ఈ పీఠం కొందరు తమిళనాడులోని కంచిలో

## 8. విభాశ. శ్రీ కపాలినీదేవి

ఈ శక్తిపీఠం పశ్చిమబెంగాల్ లోని తూర్పుమేదినీపుర (మిద్నాపూర్) సమీపంలోని తామ్లుక్ లో ఉంది. ఇచట దేవి కాలిలోని ఎముక బీనఖండం (మోకాలిచిప్ప కిందనుండి పాదం దాకా) పదిందని నమ్ముతారు. ఈ దేవిని భీమరూపా లేదా కపాలిని అని అంటారు. ఈ దేవితో ఉన్న శివుడిని 'సర్వానంద' అన్న పేరుతో వ్యవహరిస్తారు.

## 9. రత్నావళి కుమారీదేవి

ఈ శక్తిపీఠం పశ్చిమబెంగాల్ లోని వాంగ్లీ జిల్లా ఖానాకుల్-1 కృష్ణానగరం మధ్యనున్న రత్నాకర నది తీరంలో ఉంది. కోల్కత్తా నుండి బస్ సౌకర్యం ఉంది. నదీమార్గం ద్వారా చేరవచ్చు.

ఈ శక్తిపీఠాన్ని మూడుచోట్ల గుర్తిస్తారు. కొందరు కోల్కత్తా నుండి దాదాపు 90 కి.మీ దూరంలో ఖానాకుల్ లోని ఆనందమయి దేవాలయమే ఈ శక్తిపీఠం అంటారు. కొందరు బీహార్ రాష్ట్రంలోని ఉచ్చిత్ గ్రామంలోని భగవతీదేవి ఆలయం అంటారు. మరికొందరు ఈ క్షేత్రం చెన్నై సమీపంలోని 'రత్నావళి' అన్నారు. ఇచ్చట మాత కుడిభజం పడినట్లు చెబుతారు. దేవిని 'కుమారి' అంటారు. ఇచ్చటి శివుడు 'భైరవుడు'గా పూజలందుకొంటున్నాడు.

## 10. బక్రేశ్వర్‌లోని మహిషమర్దినిదేవి

బడ్ హామ్ జిల్లా దబ్ర పూర్ రైల్వే స్టేషన్ నుండి 7 కిలోమీటర్ల దూరంలోని సియుడిపట్నం నుండి 14 కిలోమీటర్ల దూరంలో ఉంది. సమీపంలోనే పాపహరా

అన్న నది ప్రవహిస్తున్నది. శివరాత్రినాడు ఇచ్చట పెద్ద జాతర జరుగుతుంది. స్థలపురాణం ప్రకారం దేవి భ్రూ మధ్య భాగం ఇక్కడ పడింది. దేవిని మహిషాసుర మర్దిని అంటారు. దేవి ఉగ్రరూపంలో మహిషుని దేహంపై కాలు పెట్టి నిల్చుని ఉన్న ఉగ్రభంగిమలో కనిపిస్తుంది.

ఇచ్చటి శివుని 'వక్రేశ్వర, బక్రేశ్వర, వక్రనాథుడు' అంటారు. ఈ పేరు వెనుక ఒక కథ ఇలా ఉంది.

సత్యయుగంలో, లక్ష్మీనారాయణుల వివాహసమయంలో అసితాంగమునిని ఇంద్రుడు ఎగతాళి చేస్తాడు. కోపంతో మునిదేహంలోని నరాలు వంకర తిరిగినందున, ఎనిమిదివిధాల అంగవైకల్యం ఏర్పడి 'అష్టా వక్ర' అన్న పేరుతో పిలువబడ్డాడు.

తర్వాత ముని బాధాతప్తుడై ఇచ్చట చాలాకాలం తపస్సు చేసి శివుని వరప్రసాదమందుకున్నాడు. శివుడు, తాను ఇచ్చట వక్రనాథుడుగా ఉంటానని అభయ ప్రదానం చేశాడు.

## 11. నల్ హతియాలోని కాళికాదేవి (నల్ హాతేశ్వరి)

ఈ పీఠం పశ్చిమబెంగాల్ లోని భీ భూమ్ జిల్లా నల్హాటి రైల్వే స్టేషన్ సమీపంలో ఉంది. ఇది కేవలం స్థానికుల పూజలందుకొంటున్న దేవాలయం. ఇక్కడ దేవి కాలి ఎముకలు పడ్డాయని ప్రతీతి. దేవిని 'కాళికాదేవి' అని, శివుని 'యోగేశ్'

అని పూజిస్తారు.

## 12. అట్టహాలోని పుల్లారదేవి

జనాకర్షణగల ఈ శక్తిపీఠం పశ్చిమబెంగాల్ లోని బర్ద్ నాన్ పూర్ జిల్లా దాక్షిందీహి, అట్టహాస్ గ్రామంలో ఉంది. రైల్వే స్టేషన్ దగ్గరలోనే ఉంది. కొల్ కత్తా నుండి సుమారు 220 కి.మీ దూరంలో ఉన్న అట్టహాస్ దేవి విగ్రహం బృహదాకారంలో ఉంది. విరిసిపూవులా ఉన్న దేవి పెదవుల వెడల్పు 15-18 అడుగులు.

ఇచ్చట దేవి పెదవులు పడినట్లు భక్తుల నమ్మకం. ఈమె పుల్లారదేవి ఇచ్చటి శివునికి 'విశ్వేశ' అన్న పేరుంది. రెండు దేవాలయాలు పక్కపక్కనే వుంటాయి.

## 13. నందీపురంలోని నందికేశ్వరీదేవి

పశ్చిమబెంగాల్ లోని బీరూమ్ జిల్లాలో ఉందీ శక్తి పీఠం. సైన్ తియానగరం (నందీపుర్) నుండి రైలు, బస్సు సౌకర్యం ఉంది. ఇచ్చట అతిపెద్ద వటవృక్షం క్రింద దేవివిగ్రహం ఉంది. ఈమెని నందిని లేదా నందికేశ్వరి అంటారు. ఇచ్చటి శివుని పేరు నందికేశ్వరుడు. స్థానికులు మాత్రమే పూజలు చేస్తుంటారు.

### ఉత్తర ప్రదేశ్లోని శక్తిపీఠాలు

ఉత్తర ప్రదేశ్ లోని నాలుగు శక్తి పీఠాలు అత్యంత ప్రసిద్ధమైనవి. ఇవి వారణాసి, అలహాబాద్ పరిసరాల్లో ఉన్నాయి. ఇక్కడ శివాలయాలే ప్రముఖమైనందున శక్తిపీఠాల ప్రశస్తి అంతగాలేదు.

## 14. ప్రయాగలోని లలితా దేవి శ్రీ లలితాదేవి

శక్తిపీఠం సన్నిధానం అలహాబాద్ సమీపంలోని గంగ, యమున, సరస్వతి నదుల సంగమస్థానమైన 'సంగం' అన్నచోట ఉంది. ఈ త్రివేణీ సంగంమంలో స్నానం చేస్తే సర్వపాపాలు పరిహారాలు అవుతాయన్న విశ్వాసం ప్రదానంగా శివభక్తులలో ఉంది.

ఇచ్చట దేవి కుడిచేతి వేళ్ళు పడినాయని పురాణోక్తి. ఇచ్చట దేవిని 'లలితా', 'అలోపిదేవి' అన్న పేర్లతో పూజిస్తారు. ఇచటి శివునికి 'భైరవ' లేదా 'భవ' అన్న పేర్లున్నాయి. చిన్నడోలీలో దేవి విగ్రహాన్ని ఉంచి పూజిస్తారు. దేవిని డోలీలో ఉంచి పూజించడంలో కుతూహలం రేకెత్తించే ఐతిహ్యం ఉంది.

చాలా ఏళ్ళ క్రితం అచట పెద్ద అరణ్యం ఉండేది. వివాహసందర్భంలో వధువును డోలీలో కూర్చుండబెట్టి, ఆమెను భర్త ఇంటికి తీసుకువెళ్ళటం పద్ధతిగా ఉండేది. అటువంటి పద్ధతి మేరకు ఒక పెళ్ళి డోలీ యాత్ర జరుగుతున్నప్పుడు దొంగలు పెళ్ళికుమార్తె నగలను దోచుకొన్నారు. వధువు డోలీవెంట ఎవరూలేరు. దేవియే వధువును మాయంచేసి కాపాడింది. అన్న వార్త వ్యాపించింది.

ఆ సంఘటనే కాలక్రమంలో కథగా మారి, దేవికి 'ఆలోపి' అన్న పేరు రూఢిగా మారింది. కొందరు అలహాబాద్ లోని 'లలితాదేవి' ఆలయమే వాస్తవమైన శక్తిపీఠం అన్నారు. ఈ క్షేత్రం చేరడానికి బస్సు ఇతర వాహనాల సౌకర్యం ఉంది.

## 15. వారణాసిలోని విశాలాక్షి / మణికర్ణికా

వారణాసి లేదా కాశీ హిందూవులకు అత్యంత పవిత్ర క్షేత్రం. ఇక్కడి దేవాలయాన్ని శివుడే నిర్మించినట్లు భక్తులు విశ్వసిస్తారు. ఋగ్వేద, స్కాందపురాణ, రామాయణ,

మహాభారతాల్లో ఈ ఆలయప్రసక్తి ఉంది. ఇచ్చట దేవి కర్ణకుండలాలు పడినట్లు ప్రతీతి. అందువల్ల భక్తులు దేవిని మణికర్ణికా అని పిలుస్తారు. ఇక్కడి దేవి విశాలాక్ష్మి, ఇచట శివుడు విశ్వనాధుడు అన్న పేరుతో పూజలందుకొంటున్నాడు. ఇక్కడ కాలభైరవ, అన్నపూర్ణ. డుండి(గణపతి)దండపాణి ఆలయాలు కూడా వున్నాయి.

అన్నపూర్ణాలయంలో రోజూ అన్నదానం జరుగుతుంది. ఇందుకు సంబంధించిన కథ ఒకటి ఉంది. ఒకసారి పార్వతి, పరమశివుని మూడుకన్నులనూ, వినోదార్థంగా తనచేతులతో మూసినపుడు ఆమె శరీరమంతా నల్లగా మారింది. దీనికి కారణమేమని పార్వతి ప్రశ్నించి, ఈ వికారరూపాన్ని మార్చవలసిందిగా వేడుకొంటుంది. కాశీలో అన్నదానం చేస్తే క్రమంగా ఆమె రూపం మారగలదని శివుడు అన్నాడు. శివుడి ఆజ్ఞతో పార్వతి అన్నపూర్ణగా మారి అచట వెలుస్తుంది. అన్నదానం చేయడంతో ఆమె రూపం యథాతథస్థితిని చేరుకొంటుంది. కంచి కామాక్షి, మధురమీనాక్షి, కాశీ విశాలాక్షీ, దేశవ్యాప్తమైన సుప్రసిద్ధ క్షేత్రాలు.

విశాలాక్షీ దేవాలయంలో శ్రీచక్రం ఉంది. దక్షిణభారతి మందలి భక్తులు ఇచటికి వచ్చి పూజలు చేస్తుంటారు. దేవి పాతవిగ్రహం ఉద్భవమూర్తి అని ప్రతీతి.

**16. రామగిరిలోని శివాని**

శివానీదేవి రామగిరిలోని శక్తిపీఠం. చిత్రకూట జిల్లా ఝాన్సీ మాణిక్ పూర్ రైలుమార్గం ఉంది. చిత్రకూట థామ్ నుండి 11 కి.మీ దూరంలో ఉన్న రామగిరికి సమీపంలోని విమానాశ్రయం ఖజురహో (దాదాపు 175 కి.మీ) ఇక్కడికి బస్సు ఇతర వాహనాల సౌకర్యం ఉంది. ఇచ్చట దేవి వామవక్షస్థల కుడిభాగం పడిందని నమ్మకం. ఇచ్చటి దేవి పేరు శివాని. ఇచటి శివుని 'చండ' అంటారు. చిత్రకూటం దక్షిణం వైపున 2 కి.మీ.

దూరంలో మందాకినీ నదీతీరంలో పవిత్రమైన జానకీసరోవరం లేదా జానకీకుండం ఉంది. ఈ స్థలాన్నే శక్తిపీఠమని కొందరు విశ్వసిస్తారు.

ఈ శక్తిపీఠం బౌద్ధ కేంద్రమైన రాజఘర్ లో ఉంది. ఇచ్చట గృద్దకూట అనుచోట వేడినీటి బుగ్గలున్నాయి. యాత్రికులు ఇచ్చట స్నానం చేసి, సమీప దేవాలయంలో స్వామి దర్శనం చేసుకొంటారు.

**17. బృందావన - ఉమాదేవి**

శ్రీకృష్ణుని లీలా క్షేత్రమైన ఉత్తరప్రదేశ్ లోని బృదావనంలో దేవి ముంగురులు (తల ంట్రుకల ముందున్న శిరోజాలు) పడినట్లు ప్రతీతి. ఆగ్రా నుండి 50 కిలోమీటర్లు. ఢిల్లీ నుండి 150 కిలోమీటర్లు దూరంలో ఉంది. ఈ క్షేత్రానికి పన్నెండు కిలోమీటర్లు దూరంలో మధుర రైల్వే స్టేషన్ ఉంది. బృందావనంలోని దేవి పేరు ఉమాశివ. శివుని పేరు భూతేశ్వరి మహాదేవుడు.

**మధ్యప్రదేశ్లోని శక్తిపీఠాలు**

**18. అమరకాంతలోని నర్మదాదేవి**

మధ్యప్రదేశ్ లో అంతగా ప్రాచుర్యం పొందని శక్తి పీఠాలు 3 వున్నాయి. వాటిలో మొదటిది హరధోల్ జిల్లా అమరకాంతాలోని కాళీ ఆలయం ఇచటికి 42 కిలోమీటర్ల దూరంలో వెంద్వా రైల్వేస్టేషన్ ఉంది. షహదోల్, ఉమారియా, జబల్ పూర్, రేవా, బిలాస్ పూర్ నుండి అమరకాంతాకు బస్ సౌకర్యం ఉంది.

సమీపంలో విమనాశ్రయాలు జబల్ పూర్ 228 కిలో మీటర్ల రాయ్ పూర్ 210 కిలోమీటర్ల దూరంలో ఉన్నాయి. ఇచ్చట దేవి నడుము వెనుకభాగం పడినట్లు ప్రతీతి ఇచ్చటి దేవిపేరు నర్మదాదేవి. ఇచ్చటి శివుని పేరు భద్రేశ, భద్రసేన లేదా భైరవుడు.

### 19. శో దేశ్లోని కాళీదేవి

శోన్ లేదా శోణ్ నదీతీరంలోని ఒక గుహలో ఉన్న దేవిని 'కాళి' అంటారు.

ఈమెను శోనాక్షి అని కూడా పిలుస్తారు. ఇచ్చటి శివుని పేరు అసితాంగ. ఈ పీఠాన్ని గురించిన మరి ఏ ఇతర వివరాలు లేవు.

### 20. భైరవపర్వతంలోని ఆవంతీదేవి

ఉజ్జయినీ సమీపంలోని భైరవపర్వతంపై ఆవంతీదేవి ఆలయం ఉంది. ఇచ్చట దేవి పై పెదవి భాగం పడిందని నమ్మకం. ఇచ్చటి శివుడు లంబకర్ణ అన్న పేరుతో భక్తులచేత పూజలందుకుంటున్నాడు.

### తమిళనాడులోని శక్తిపీఠాలు

దక్షిణ భారతదేశం యాత్రాస్థలాలకు పెట్టిది పేరు. వాటిలో కంచి కామాక్షి, కన్యాకుమారి, శుచీంద్రలోని నారాయణి దేవాలయాలు సుప్రసిద్ధమైనవి. వీటినే కాక శ్రీశైల భ్రమరాంబాదేవి ఆలయాన్ని కూడా శక్తిపీఠంగా పేర్కొన్నారు.

### 21. కంచికామాక్షీదేవి

కంచి లేదా కాంచీపురం చెన్నైనుండి 8 కిలోమీటర్లు, తిరుపతి నుండి 90 కిలోమీటర్ల దూరంలో ఉంది. దేశం పలుచోట్ల నుండి రైలు సౌకర్యం ఉంది.

పల్లవుల దాజధానిగా ఉన్న కంచి, శుద్ధమైన పట్టుచీరలకు చాలా ప్రసిద్ధమైనది. కంచికామాక్షి ఆలయం ద్రావిడశైలిలో నిర్మించబడింది. ఈ క్షేత్రం ఆదిశంకరుల కారణంగా సువిఖ్యాతమైంది. శంకరుల సౌందర్యలహరిలో శక్తిపూజ విశిష్టత చెప్పబడింది.

ఇచ్చట దేవి ఒడ్డాణం పడినట్లు విశ్వసిస్తారు. శక్తి పీఠాధీశురాలైన దేవిని ఆదిపీఠేశ్వరి లేదా ఆదిపీఠపరమేశ్వరి అని, శివుని 'కాలభైరవుడని' పూజిస్తారు.

### 22. కన్యాశ్రమంలోని కన్యాకుమారీదేవి

భారతదేశ దక్షిణ సరిహద్దులో అరేబియా సముద్రం, హిందూమహాసముద్ర తీరాల ప్రదేశంలో దేవి వెన్నుగం పడిందని భక్తులు విశ్వసిస్తారు. లోగడ పార్వతీదేవి శివునికోసం తపస్సు చేసి 'కన్యాకుమారి' అన్న పేరు అందుకొన్నట్లు పురాణాలు చెబుతున్నాయి. ఈ స్థలం బాణాసురుణ్ణి హతమార్చిన స్థలంగా చెబుతారు.

ఇచ్చటి పుష్కరిణిలో స్నానం చేసి దేవిని దర్శిస్తే సకల పాపాలు పరిహార మవుతాయని భక్తుల విశ్వాసం.

‘‘ స్వామి వివేకానందులు సముద్రంలో దూకి మధ్య నున్న శిలాద్వీపం వరకు ఈది అచ్చట ధ్యానమగ్నులైన విషయం అందరికీ తెలిసిందే. నాటి నుండి ఈ స్థలానికి అత్యంత ప్రశస్తి లభించింది. ఇక్కడ దేవి వీపుభాగం పడిందని ప్రతీతి.

ఇప్పుడు భారతదేశం నలుమూలల నుండి రైలు, బస్సు సౌకర్యం కన్యాకుమారి క్షేత్రానికి ఉంది. ఇచ్చటి అధినేతను 'శర్వాణి' అని, శివుని 'నిమిషి' అని పూజిస్తారు. (కొందరు దేవి పీఠం ఇది కాదని బంగ్లాదేశం లోని చిట్టగాంగ్ అని చెబుతారు.)

### 23. శుచీంద్రంలోని నారాయణీదేవి

కన్యాకుమారి, తిరువనంతపురం మధ్యనున్న శుచీంద్రంలో దేవి దవడ భాగం పడిందని చెబుతారు. ఇచ్చటి దేవిని నారాయణి అంటారు.

శివుణ్ణి 'సంహర' అని పూజిస్తారు. ఈ దేవిని దంపతులు భక్తి శ్రద్ధలతో పూజిస్తే ముద్దుగారే సంతానాన్ని అందుకొంటారని విశ్వసిస్తారు.

## ఆంధ్రప్రదేశ్ లోని శక్తిపీఠాలు

**24. శ్రీశైల శ్రీ సుందరీదేవి**

ఆంధ్రప్రదేశ్ లోని ప్రముఖ శక్తిపీఠమైన శ్రీశైలం కర్నూలు నుండి 108 కిలోమీటర్ల దూరంలో ఉంది. హైదరాబాదు నుండి 210 కిలోమీటర్లు బెంగుళూరు నుండి కూడా ఎన్నో బస్సులున్నాయి. 'శ్రీశైల శిఖరం దృష్ట్వా పునర్జన్మ నవిద్యతే' అన్న విశ్వాసం భక్తులలలో ఉంది.

ఇచ్చటి మల్లికార్జునస్వామి దేవాలయంలో శివరాత్రి, కార్తీకమాసం, నవరాత్రుల మరియు దీపావళి నాడు విశేష పూజలు జరుపుతారు. శైవకేంద్రమైన శ్రీశైలంలో సీతాదేవి సహస్రలింగములను స్థాపించినట్లు ప్రతీతి. ఇచ్చట పంచపాండవ పీఠాలున్నాయి.

అరుణాసురుడు అను రాక్షసుడు బ్రహ్మదేవుని వరబలంతో మదోన్మత్తుడై నరులను, సురులను, హింసించసాగాడు. దేవతల ప్రార్థనలతో ప్రత్యక్షమైన పార్వతీదేవి భ్రమర (తుమ్మెద) రూపిణియై వాడిని వధించి భ్రమరాంబ, భ్రమరాదేవి అన్న పేరుతో పూజలందుకొంటున్నది. లోగడ ఇచ్చట వామాచార పద్ధతిలో పూజలు జరుగుతుండేవి.

ఆదిశంకరులు ఇక్కడికి విచ్చేసి వామాచార పూజలను నిషేధించి వైదిక నియమాను సారంగా శ్రీచక్ర ప్రతిష్ట చేశారు.

ఇక్కడ దేవి కుడికాలుకున్న ఆభరణం ముక్కలైపడింది. ఇక్కడి దేవిని శ్రీ సుందరిగా, శివుణ్ణి సుందరానందగా పూజిస్తారు. (కాశ్మీరులోని లడక్ సమీపంలో ఇదే పేరుగల మరొకపీఠం ఉంది.)

**25. ద్రాక్షారామంలోని విశ్వేశ్వరి లేదా మాణిక్యాంబాదేవి**

ఈ శక్తిపీఠం రాజమండ్రి సమీపంలోని దాక్షారామంలో ఉంది. విజయవాడ నుండి దాదాపు 200 కి.మీ. కాకినాడ నుండి సుమారు 30 కి.మీ దూరంలో ఉంది. సమీపంలో సామర్లకోట రైల్వేస్టేషన్ ఉంది. దేవి చెంపలు ఇచ్చట పడినవన్న విశ్వాసం ఉంది. ఈ దేవతను మాణిక్యాంబ, రాకిణి లేదా విశ్వేశ్వరి అని, శివుణ్ణి వత్సనాభ, దండపాణి అని పిలుస్తారు.

ఒక ఐతిహ్యం ప్రకారం తారకాసురుని సంహారానికి వెళ్ళిన కుమారస్వామి వాడిని చంపిన తర్వాత, వాని కంఠంలోని అమృతలింగాన్ని వేరుచేసి దానిని ఐదు ఖండాలు చేశాడు. ఈ ఐదు ఖండాలు పడిన స్థలంలో దేవతలు లింగ ప్రతిష్టలు చేసారు. ఇవే పంచారామ లింగాలుగా పేరుగాంచాయి. ఇక్కడ భీమేశ్వరుడు పంచారామలింగాలలో ఒకటిగా ప్రసిద్ధిగాంచాడు.

**గుజరాత్ లోని శక్తి పీఠాలు**

**26. ఆరసురి అంబాజీదేవి**

గుజరాత్ లోని ప్రముఖ శక్తిపీఠమైన ఆరసుర అంబాణి దేవాలయం బానస్ కాంతా జిల్లాలో ఉంది. పాలపూర్ నుండి దాదాపు 65 కి.మీ. మౌంట్ అబూ నుండి 45 కిలోమీటర్ల, మౌంట్ అబూ రోడ్ నుండి 20 కి.మీ. దూరంలో గుజరాత్-రాజస్థాన్ సరిహద్దులో ఉంది. దేవి గుండె ఇక్కడ పడిందని ప్రతీతి.

ఇక్కడ దేవి విగ్రహానికి బదులుగా బంగారు తొడుగుల 51 అక్షరాల రాత ఉంది. శ్రీ చక్రం ఉంది. ప్రతిరోజూ ఇక్కడి ఆలయంలో శ్రీచక్రార్చన జరుగుతుంది. దేవిని బాలరూప ఆలంకారంలో, మధ్యాహ్నం. సాయంకాలం యువతిగా లేదా అర్ధనారీశ్వరిగా అలంకరిస్తారు. నవరాత్రులలో వైభవంగా ఇక్కడ జాతర జరుగుతుంది.

**27. సోమనాథ్ లోని చంద్రభాగాదేవి**

గుజరాత్ లోని జునాగఢ్ జిల్లాలోని సుప్రసిద్ధ సోమనాథ్ దేవాలయం వద్దనున్న ఈ శక్తిపీఠం రావల్ రైల్వే స్టేషన్ నుండి దాదాపు 13 కి.మీ. జునాగఢ్ విమానాశ్రయం నుండి 95 కి.మీ దూరంలో ఉన్నాయి. సమీపంలోనే హీరా, కపిలా, సరస్వతి నదులు ఉన్నాయి. ఈ

స్థలంలో దేవి ఉదరభాగం పడిందని భక్తులు నమ్మకం. చంద్రభాగాదేవికి ఆలయం లేదు. ఇచ్చట శివుణ్ణి 'వక్రతుండ' అని పిలుస్తారు. ఈ స్థలాన్ని ప్రభాసక్షేత్రం అని కూడా పిలుస్తారు.

**రాజస్థాన్‌లోని శక్తిపీఠాలు**

**28. పుష్కరలోని గాయత్రి**

రాజస్థాన్ లోని అజ్మీర్ కు వాయవ్యంగా పదకొండు కిలోమీటర్ల దూరంలోని పుష్కర్ సమీపంలోని గాయత్రి గిరిలో ఈ శక్తిపీఠం ఉంది. పుష్కర్ ఒంటెల, పరుగుపందేలకు ప్రసిద్ధి. ఈ పోటీలను ఏటా జరుపుతారు. అందువల్ల విదేశపర్యాటకులు ఎక్కువగా వస్తారు.

ఈ సంబంరం కారణంగా శక్తిపీఠాల మహత్తు కొంత తగ్గింది. బస్, ఇతర వాహనాల సౌకర్యం ఉంది. అజ్మీర్ సమీపంలో జైపూర్ విమానాశ్రయం ఉంది.

గాయత్రీదేవి ఇచ్చట శక్తిదేవత. ప్రస్తుతం ఉదయకాల పూజలు మాత్రం జరుగుతున్నాయి. దగ్గరలోనే సర్వానంద అన్న శివాలయం ఉంది.

**29. విరాటనగరంలో అంబికాదేవి**

జైపూర్ సమీపంలోని భరత్ పూర్ లోని శక్తి పీఠ పౌరాణిక గాథలు పరిశీలించినపుడు విరాటనగరం మూడుచోట్ల ఉన్నట్లు తెలియవచ్చింది.

జైపూర్ నుండి 90 కి.మీ. దూరంలో విదాట లేదా బారాట అన్న గ్రామం, పశ్చిమబెంగాల్ లోని దినాజ్ పూర్ జిల్లా బెరాట.

బంగ్లాదేశ్ లోని రంగాపూర్ లో దేవి ఎడమకాలివేళ్ళు పడినట్లు స్థానికుల అభిప్రాయం. ఇచ్చటి దేవతను అంబికా అని, శివుణ్ణి అమృతేశ్వరుడని పూజిస్తారు.

### జమ్మూ-కాశ్మీర్ లోని శక్తిపీఠాలు

### 30. అమర్నాథ్లోని మహామాయాదేవి

జమ్మూ-కాశ్మీర్ లోని అనంతనాగ్ జిల్లా పహల్ గావ్ శక్తిపీఠం కంటే మిన్నగా అమర్నాథ్ యాత్ర పేరు గాంచింది. ఏడాదికోకమారు సహజంగా రూపొందే హిమలింగం పవిత్రదర్శనం కోసం జులై, ఆగష్టు నెలల్లో లక్షలాదిమంది భక్తులు పాదచారులుగా వస్తారు. శ్రీనగర్ నుండి పహల్ గావ్ 94 కిలోమీటర్లు బస్ లో వెళ్ళి అక్కడనుండి కాలినడకన ఇచ్చటికి చేరుతారు.

బహుకూట వెనుకవైపున అడవిలో పురాతన మహామాయా, త్రినంధేశ్వరాలయాలు ఉన్నాయి. సమీపంలోనే తావి నది ఉంది. ఇచ్చటి దేవి గొంతుక భాగం పడిందంటారు. అమర్నాథేశ్వరునితో పాటు అమరనాధేశ్వరి వెలసినట్లు విశ్వసిస్తారు.

### 31. పఠాన్ కోట్ లోని జ్వాలాముఖీదేవి

ఈ శక్తిపీఠం కాంగ్రా జిల్లా శివాలిక్ ధర్మశాల నుండి 60 కిలోమీటర్ల దూరంలో ఉంది. బస్సులు ఉన్నాయి. ఇచ్చట దేవి నాలుక పడిందని చెబుతారు.

ఇచ్చట శక్తిదేవతను 'సిద్ధహా' లేదా 'లంబికా' అని శివుని ఉన్మత్త భైరవ అని పూజిస్తారు. ఈ క్షేత్రానికి రావటానికి మార్చి-ఏప్రిల్ మరియు సెప్టెంబరు, అక్టోబరు

నెలలు చాలా అనుకూలమైనవి. తక్కిన నెలల్లో రహదారి మంచుతో కప్పబడి వుంటుంది.

పూజాస్థలంలో విగ్రహం ఉండదు. కాని రాళ్ళ సందునుండి ఒక జ్వాల వెలుగుతుంటుంది. ఈ స్థలాన్నే 'మహాకాళి నోరు' అని చెబుతారు. తొమ్మిది జ్వాలలుంటాయి. వాటిని సరస్వతి, అన్నపూర్ణ, చండి, హింగ్వాణ్, వింధ్యవాసిని, మహాలక్ష్మి, మహాకాళి, అంబికా, అంజనా అని పిలుస్తారు. ఇచ్చట శ్రీచక్రయంత్రం లాగా మలచిన శిలను సదా పూవులతో కప్పివుంచుతారు.

అక్బరు ఇచ్చటకి వచ్చినప్పుడు ఆ నిరంతర జ్వాలను చూచి ఆశ్చర్యచకితుడై, దానిని పరీక్షించడం కోసం నీటిని పోయమని ఆదేశించాడట. ఎంత నీటిని పోసినా జ్వా ల మలిగపోక మరింత పెద్దగా వెలగసాగింది. ఇదంతా దేవి మహిమగా భావించి, పాదరక్షలు వదలి దేవిదర్శనం చేసుకొన్నాడట.

అతని భక్తిని గమనించి జ్వాలాముఖీ దేవి సంతుష్టి చెందనట్లుగా భావించి తిరిగి గోడవైపు చూడగా అది లోహ ఛత్రంగా కనిపించిందట. తర్వాత అక్బర్ ఆమెకు శాశ్వతంగా భక్తుడు అయ్యాడు.

**ఒరిస్సాలోని శక్తిపీఠం**

**32. జాజ్ పురంలోని విరజాదేవి**

ఈ శక్తిపీఠం పూరీ జగన్నాథాలయంలో ఉంది. భువనేశ్వర్ నుండి ఇక్కడికి చేరుకోవడానికి వాహన సౌకర్యం ఉంది. అక్కడే విమానాశ్రయం ఉంది.

పూరిజగన్నాథ రథయాత్ర విశ్వవిఖ్యాతమైనది. పూరీలో సప్తమాతృకలు ఉన్నారు. కొందరు దీనినే శక్తిపీఠం అని భావిస్తారు. కానీ ఒరిస్సాలో జాజ్ పూర్ లోని విమలాదేవి ఆలయమే శక్తిపీఠం అని ఇక్కడే దేవి నాభిభాగం పడిందని భక్తులు విశ్వసిస్తారు. దీనినే వడ్డాణ పీఠమని కూడా ఈ దేవిని విరజా అని శివుణ్ణి జగన్నాథుడని అంటారు.

## త్రిపురలోని శక్తిపీఠం

### 33. త్రిపురలోని త్రిపురసుందరీదేవి

త్రిపురలోని ఉదయపూర్ వద్దనున్న రాధాకిశోర్‌పూర్ సమీపంలోని త్రిపురసుందరీదేవి ఇచ్చటి శక్తిపీఠాధిదేవత. ఇక్కడ దేవి కుడికాలు పడిందని విశ్వసిస్తారు. అగర్తలా నుండి 55 కి.మీ. ఉదయపూర్ నుండి 3 కి.మీ దూరంలో ఉంది. 16వ శతాబ్దంనాటి ఈ చిన్న దేవాలయాన్ని మతబారి దేవాలయమని, దేవిని త్రిపురసుందరి, త్రిపురభైరవి, లలితాంబా అని అంటారు.

తాబేలు ఆకారం గల పీఠం ఉన్నందున కూర్మపీఠం అని కూడా పిలుస్తారు. ఇచ్చటి శివుని 'త్రిపురేశుడు' అని పూజిస్తారు. దేవి విగ్రహం ఏడు అడుగుల ఎత్తున్నది. సమీపంలోనే రెండడుగుల చిన్న విగ్రహం ఉంది. దీనిని 'చోటీమా' అంటారు.

దేవాలయం వెనుక వైపున వున్న సరోవరం (కల్యాణసాగర) ఉంది. ఈ సరోవరంలో లెక్కలేనన్ని చేపలు తాబేళ్ళు ఉన్నాయి. సహజంగా చనిపోయిన చేపలు, తాబేళ్ళకు విద్యుక్తంగా సంస్కారం చేస్తారు ఇక్కడ భక్తులు.

**అస్సాంలోని శక్తిపీఠం**

**34. గువాహాటిలోని కామాఖ్యాదేవి**

ఈ శక్తిపీఠాన్ని సాంప్రదాయ ఆచారాలు మేళవించిన నిజమైన శక్తిపీఠం అనవచ్చు. ఎందుకనగా శక్తిపీఠమూలమే యోనిపూజ. అది ఇక్కడ అక్షరాలా అచరింపబడుతుంది. ఇక్కడ వామాచార బలిపూజ, కౌలమంత్ర పూజలు జరుపబడుతున్నాయి. గువాహాటి నగరంనుండి సుమారు 7 కిలోమీటర్ల దూరంలోని నీలాచలపర్వతం పైనున్న శక్తిపీఠంలో దేవి యోనిభాగం పడిందని నమ్మకం ఉంది. సమీపంలోనే గువాహాటి విమనాశ్రయం ఉంది.

ఇక్కడున్న శివుణ్ణి ఉమానంద అంటారు. ఈ దేవాలయంలో భక్తులు స్వయంగా పూజ చేసుకుంటారు. ఇక్కడ జంతుబలి వాడుకలో ఉంది. మగజంతువులను మాత్రం బలిగా ఇస్తారు. ఈ క్షేత్రాన్ని గురించిన ఐతిహ్యాలున్నాయి. చాలా కాలం క్రితం ఇద్దరు రాజకుమారులు వేటకై వచ్చారు. అక్కడున్న ఓ వృద్ధురాలిని నీళ్ళు కావాలని కోరారు. ఆమె సమీపంలోనే ప్రవహిస్తున్న చిన్న నదిని చూపి అచ్చటికి వెళ్ళి మీ దాహం తీర్చుకోందని చెప్పింది.

అ స్థలంలో దేవి యోనిభాగం పడినందున ఇక్కడ దేవాలయం నిర్మించండి అని సూచించి అదృశ్యమైందట. రాజకుమారులు స్థలాన్ని పరిశీలించినపుడు యోని

రూపంలో ఉన్న శిలను చూశారు. ఈ శిలచుట్టూ నీరు ప్రవహించడం చూసి ఆశ్చర్య చకితులై అక్కడ దేవాలయాన్ని నిర్మించారు.

### హర్యానాలోని శక్తిపీఠం

### 35. కురుక్షేత్రంలోని సావిత్రీదేవి

హర్యానాలోని కురుక్షేత్రం (లోగడ స్థానేశ్వరం, నేటి తానేసర్) సమీపంలో ఉంది. ఈ శక్తిపీఠం. ఇది దేవి కాలి మీనఖండం పడిన స్థలమంటారు. ఇచ్చటి దేవిని సావిత్రి అని, శివుణ్ణి 'స్థాణు' అని పిలుస్తారు. ఇచ్చట నిరంతరం పూజలు జరుగుతుంటాయి. మహాభారత యుద్ధం జరిగిన కురుక్షేత్ర స్థలం ఇదే. ఆంపశయ్యపై పడుకున్న భీష్మాచార్యులున్న స్థలం, వైశంపాయన సరోవరం. ఇవన్నీ ఇచ్చటి దర్శనీయ స్థలాలు.
-

### మహారాష్ట్రలోని శక్తిపీఠం

### 36. నాసిక్ లోని భ్రామరీదేవి

ఈ శక్తిపీఠం మహారాష్ట్రలోని జనస్థానంలో ఉంది. నాసిక్ నుండి గోదావరి తీరానికి వచ్చి అక్కడి నుండి ఈ శక్తిపీఠం చేరుకోవచ్చు. నాసిక్ చేరేందుకు ముంబై నుండి విమానయానం చేయడానికి వీలుంది. నాసిక్ గొప్ప వ్యాపార కేంద్రం.

ఇచ్చట దేవి చెంపభాగం పడిందట. దేవిని భ్రామరీ దేవి లేదా ధారాదేవి అని, శివుణ్ణి వికృతేశ అని పిలుస్తారు. సమీపంలోని పంచవటి కళారామం అనేచోట శివలింగం ఉన్న గుహ ఉంది.

ఈ లింగాన్ని శ్రీరామచంద్రుడు తన పరివారంతో పూజించినట్లు స్థలపురాణం పేర్కొన్నది. శ్రీరాముడు ఖర దూషణులతో పోరాడి 14 వేలమంది రాక్షసులను సంహరించినదిక్కడే అని ఒక ఐతిహ్యం ప్రాచుర్యంలో వుంది.

### ఛత్తీస్ గఢ్ లోని శక్తిపీఠం

### 37. దంతెవాడ దంతీశ్వరీదేవి

ఛత్తీస్ గఢ్ లోని ఏకైక శక్తిపీఠం జగదల్ పూర్జిల్లా దంతెవాడ సమీపంలోని బస్తర్ లో ఉంది. ఇచ్చట దేవి పళ్ళు పడినట్లు ప్రతీతి. అందువల్లనే ఇచ్చటి దేవిని దంతేశ్వరి అని, శివుణ్ణి 'కపాలభైరవ' అని పిలుస్తారు.

ఈ స్థలం ప్రకృతి రమణీయతకు నిలయంగా ఉంది. ఇచ్చటి దేవాలయం దాదాపు 14వ శతాబ్దిలో చాళక్యులచే నిర్మింపబడిందట. ఏటా ఇక్కడ నవరాత్రి ఉత్సవాలు వైభవంగా జరుగుతాయి.

### *విదేశాలలో శక్తిపీఠాలు - బంగ్లాదేశ్లోని శక్తిపీఠాలు*

### 38. షికార్‌పూర్ సునందాదేవి

బంగ్లాదేశ్ లోని బారిసాల్ నగరం సమీపంలోని శికార పూర్లో ఈ శక్తిపీఠం ఉంది. బారిసాల్ నుండి 20 కిలోమీటర్ల దూరంలో సునందానదీతీరంలో ఉంది.

ఢాకానుండి బస్ సౌకర్యం ఉంది. కాని పడవ ప్రయాణం బాగుంటుంది. ఈ స్థలంలో దేవి ముక్కు పడిందని నమ్మకం. సునందాదేవి ఆలయసమీపంలో శివాలయం ఉంది.

ఇచ్చటి శివుడు త్ర్యంబకుడు పూజలందుకొంటున్నాడు. గోపురం ఉన్న ఈ దేవాలయంలోని దేవిని 'ఉగ్రతార' అని పిలుస్తారు. మార్చి నెల శివచతుర్దశినాడు అసంఖ్యాకంగా భక్తులు వస్తారు. సాధకులు, ఉపాసకులు ఎంతో నియమంతో ఇక్కడి దేవిని ఉపాసిస్తారు.

### 39. సిలావాట్ లోని మహాలక్ష్మీదేవి

బాంగ్లాలోని మరొక శక్తిపీఠం సిల్వాట్ పట్నం సమీపంలోని జైన్ పూర్ సమీపంలో మహాలక్ష్మీ క్షేత్రం. కాని మరికొన్ని శక్తిపీఠాలు అక్కడున్నాయంటారు.

మొదటి పీఠం షిల్లాంగ్-సిలైట్ రహదారిన ఉంది. ఈ పరిసరాల్లో రాజవంశం ఒకటి ఉండేదట. ఇచట దేవి గొంతుభాగం పడిందని భక్తులంటారు. ఇక్కడ శివుడు 'శంబరానంద'గా పూజింపబడుతున్నాడు.

షిల్లాంగ్ కొండలకు తూర్పున 63 కి.మీ. దూరంలో జోదైసమీపంలోని నిరియాన్ అన్నచోట జోగేశ్వరి దేవాలయాన్ని మరోక శక్తిపీఠంగా పరిగణిస్తారు. ఇక్కడున్న ప్రాచీన దేవాలయాన్ని కూల్చి మరొక దేవాలయాన్ని నిర్మించారు. ఇచట అష్టధాతువులతో నిర్మించిన దుర్గ, జోగీశ్వరి విగ్రహాలు పక్కపక్కనే ఉన్నాయి.

### 40. సీతాకుండ భవానీదేవి

బంగ్లాదేశ్ లోని మూడవ శక్తిపీఠం. చిట్టగాంగ్ జిల్లా సీతాకుండ్ రైల్వే స్టేషన్ వద్ద ఉంది. ఇచటి చంద్రనాథ కొండపై చంద్రనాథాలయం ఉంది. ఇచట వెలసిన దేవత 'భవాని' ఇచట దేవి కుడిభుజం పడిందట. ఇచటి శివుని 'చంఖేఖర' అంటారు.

శివుడు కలియుగంలో ఈ దేవాలయానికి విచ్చేసి భక్తులకు అభయమిచ్చాడట. ఈ స్థలాన్ని కొందరు కుమారికుండ్ అని కూడా పేర్కొంటారు. ఈ పీఠం చిట్టగాంగ్ నుండి 22 కి.మీ దూరంలో ఉంది.

### 41. భవానీపురం అపర్ణాదేవి

టోగ్యాజిల్లాలోని శేర్ పూర్ ఉపజాల్లా కేంద్రం నుండి 28 కి.మీ రూరంలో ఉంది. ఈ శక్తి పీఠం దర్శించాలంటే ఢాకా నుండి జమునా బ్రిడ్జ్, చందైకోన్ స్టేషన్లు దాటి వెళ్ళాలి. గోగా బోట్ తొలా అన్నచోట దిగిన సమీపంలోనే ఈ దేవాలయముంది. ఇక్కడే శాఖాపురి అన్న సరస్సు ఉంది. చాలాకాలం క్రితం ఒక గాజు శెట్టి ఈ స్థలం నుండి వెళ్తుండగా, చిన్న బాలిక తనకూ ఒక జతగాజులు తొడగమన్నది. తాను రాజ వంశానికి చెందినట్లు చెప్పింది.

శెట్టి అందమైన గాజులు తొడిగాడు. తర్వాత ఆ బాలిక గాజుల పైకాన్ని రాజమాత నుండి అందుకోమని, తాను ఇక్కడే ఉంటానని చెప్పింది. గాజుల వర్తకుడు రాజమాత వద్దకు వెళ్ళి, గాజుల వెల ఇమ్మన్నాడు. రాజమాత తమ ఇంటివరెవరూ గాజులు కొనలేదన్నది.

గాజుల వర్తకుడు బాలిక ఉన్నచోటికి రాజమాతను పిలుచుకువచ్చాడు. ఎవరూ కానరాలేదు. గాజులశెట్టి తన బాధను ఆమెకు తెలియజేశాడు. అంతలో ఆశ్చర్యంగా ఆ సరస్సు మధ్యనుండి గాజులు ధరించిన చేతులు పైకివచ్చాయి. ఈ అద్భుత దృశ్యాన్ని చూసిన రాజమాత అక్కడ ఒక దేవాలయం నిర్మించింది. అదే నేటి శక్తిపీఠం అంటారు. ఈ ప్రాంతంలో మాఘపూర్ణిమ సందర్భంగా విశేషపూజలు జరుపుతారు. ఇచట దేవి ఎడమకాలి గజ్జెలు పడినట్లు విశ్వసిస్తారు. ఇచటి దేవినిగా, అపర్ణాదేవిగా, స్వామిని వామన భైరవుడుగా పూజలు చేస్తారు.

#### 42. ఈశ్వరీపురమందలి జెస్సూరేశ్వరి/ యశోరేశ్వరీదేవి

బంగ్లాదేశ్ లోని ఐదవ శక్తిపీఠం పాత్ ఖీర్ జిల్లాలోని జెస్సూరేశ్వరి సన్నిధానం ఈ పీఠం. సాత్ ఖీర్ జిల్లా శ్యామ్ నగర్ సమీపంలోని ఈశ్వరీపురమన్నచోట ఉంది. ఇక్కడికి చేరుకునేందుకు దౌలత్ పూర్ నుంది వెళ్ళాలి. ఇచ్చట దేవిహస్తం, పాదం పడినాయట.

ఈ దేవాలయాన్ని ఈశ్వరీపురరాజు ప్రతాపాదిత్యుడు కట్టించాడట. ఇచ్చటి శివుని 'చండ' అన్న పేరుతో పూజిస్తారు. ప్రాచీన దేవాలయం శిథిలం కావడంతో, రెండు అంతస్తుల కొత్త దేవాలయాన్ని కట్టించారు. రాజు కోట ఉన్న స్థలంలో వెలసిన ఈ దేవిని కోటేశ్వరీ అని కూడా పిలుస్తారు.

**43. భోర్ బాగ్ లోని కాళి జయంతిమాత**

ఈ శక్తిపీఠం సిలట్ జిల్లా ఫజ్లర్ పరగణాలోని భోర్ భాగ్ లో ఉంది. స్థానికులు ఈ శక్తిపీఠాన్ని 'ఫోర్ బాగ్ కాళి' దేవాలయం లేదా 'ఫజ్లర్ కాలీ బారి' అంటారు. ఈ శక్తి పీఠాన్ని పశ్చిమబెంగాల్ లోని జల్పాయ్ గురి, కొత్త ఆలీపూర్ దౌర్ రహదారిగుండా చేరవచ్చు.

బక్సా పులుల అభయారణ్యంలో ఉన్నందున అధికారుల అనుమతి పొందాలి. అభయారణ్యంలో కొంత భాగం బంగ్లాదేశానికి చెందింది. ఇచట జయంతినది ప్రవహిస్తుంది. ఈ నేపథ్యంలో దీనిని జయంతియా శక్తిపీఠమని కూడా పిలుస్తారు. సమీపంలోనే రాజ్ పుట్ ఖనా రైల్వేస్టేషన్ ఉంది. ఇచ్చట మహాకాల గహాలయం ఉంది. దీనిని 'జయంతి' లేదా 'కాళి' అని శివుణ్ణి 'క్రమాదీశ్వర' అని భక్తులు పూజిస్తుంటారు.

**నేపాల్ లోని శక్తిపీఠాలు**

నేపాల్ హిందూదేశమే. ఇచ్చటి హిందూదేవాలయాలు, దేవతలు ఎంతో ప్రశస్తమైనవి. నేపాల్ లో కేవలం మూడు శక్తిపీఠాలు ఉన్నాయి.

**44. పశుపతినాథక్షేత్రం - మహాశిరాదేవి**

పశుపతినాథ్ దేవాలయ సమీపంలోని గుహేశ్వరి సన్నిధానంలో దేవి రెండు మోకాళ్ళు పడినాయి. ఈ పీఠం చేరేందుకు ఖాట్మండు నుండి ప్రయాణం చేయాలి. ఢిల్లీ నుండి విమానం ద్వారా, బీహర్ నుండి బస్సుద్వారా చేరగలం. ఇచ్చటి శివుణ్ణి కపాలి అని పిలుస్తారు.

ఈ దేవాలయాన్ని ఇదివరలో ఈ ప్రాంతాన్ని పాలించిన రాజా ప్రతాపమల్ల నిర్మించాడట. సాధారణ భూటాన్ గోపురం శైలిలోని ఈ దేవాలయం బయటి ప్రాంతం అంతగా ఆకర్షణీయంగా ఉండదు.

దేవి ఒక ఐతిహ్యం ప్రకారం పశుపతినాథుని యోగక్షేమాలు గురించి చింతిస్తూ అతని వద్ద ఉండదలచి ఈ చోటునే నిలిచింది. మరొక జనశ్రుతి ప్రకారం ఇక్కడ దేవి యోనిభాగం పడింది. అందువల్లనే దేవిని గుహ్యేశ్వరి అన్న పేరుతో పూజిస్తారు. ఈ దేవిని 'మహాశిరా' అని, శివుణ్ణి 'కపాలి' అని పిలుస్తారు.

**45. పూఖారాలోని - గండకీచండీదేవి**

నేపాల్ లోని ధవళగిరి నుండి 125 కీ.మీ. దూరంలోని ముక్తినాథ్ నుండి బయలుదేరిన గండకీనది తీరంలోని పూఖారా సమీపంలో ఈ దేవాలయం ఉంది. ఇచ్చటి ముక్తినాథుడే సుప్రసిద్ధుడు. శక్తి పీఠానికి కూడా స్థానమే ఇది. ఇచ్చటి దేవి పాలభాగం పడిందంటారు. దేవిని 'గండకీ చండి' అని, శివుణ్ణి 'చక్రపాణి' అని పిలుస్తారు.

**46. మిథిలలోని ఉమాదేవి**

మిథిల నేపాల్-భారత్ సరిహద్దులో ఉన్న జనక పురిలో ఉంది. ఇక్కడ దేవి ఎడమభుజం పడిందని చెబుతారు. ఇచ్చటి దేవిని ఉమా అని, శివుణ్ణి మూదర' అంటారు. జనక్ పుర్ ను జనకమహారాజు పాలించినట్లు పురాణ ప్రతీతి. ఇచ్చటి జానకి మందిరమే శక్తిపీఠమని కొందరి అభిప్రాయం. ఇది రైల్వే స్టేషన్ నుండి కేవలం ఒక కిలోమీటర్ దూరంలో ఉంది. ఇచ్చటి సోనామాయ్ దేవాలయం కూడా ఉంది.

మరొక నమ్మకం మేరకు బీహర్ లోని మధుబని జిల్లాలోని 'ఉచ్చిత్' లేదా 'ఉచ్చైత్' అన్నస్థలమే శక్తిపీఠం. జనక పూర్ నుండి 30కి.మీ. దూరంలో ఉంది. ఉచ్చిత్. దీనికి సమీపంలోని రైల్వేస్టేషన్ బీహర్ లోని 'కయాటుల్' ఇచ్చటనుండి 24కి.మీ. దూరంలో ఉంది ఈ శక్తిపీఠం. దర్భంగా నుండి కూడా ఇక్కడికి బస్ సౌకర్యం ఉంది.

## పాకిస్తాన్లోని శక్తిపీఠాలు

### 47. సుక్కూర్ లోని నైనాదేవి

కరాచి జిల్లా సుక్కూర్ రైల్వే స్టేషన్ సమీపంలో ఉన్న నైనాలోని దేవాలయమే ఈ శక్తిపీఠం. ఈ శక్తిపీఠం మహిషమర్దని వెలసిన స్థానమని విశ్వసిస్తారు.

ఇచ్చట దేవి మూడు కన్నులూ పడినట్లు భక్తుల విశ్వాసం. అట్లే సతీదేవి ఇచ్చటి నైనా దేవి. ఇచ్చటి శివుణ్ణి క్రోయిన్ అని పిలుస్తారు. దీనిని శివశంకరి దేవాలయం అని కూడా అంటారు.

## 48. కరాచీలోని హింగోలాదేవి

కరాచీ నుండి సుమారు 250 కి.మీ. దూరంలోని హింగ్లాజ్ దేవాలయమే ఈ శక్తిపీఠం కరిచా - క్వెట్టి జాతీయ రహదారిలో ఝురోపాయింట్ నుండి పడమట నున్న ల్యారినగరానికి చెందిన 'ఆశాపూర్ సరి' సమీపంలో ఈ ఆలయం ఉంది. ఈ రహదారిలో పాత అగ్నిపర్వతం ఉన్నందున ఈ దారిలో ప్రయాణం చాలా కష్టమైనది. ఒంటెలమీద వెళ్ళవచ్చు.

ఈ దేవాలయం సహజమైన ఒక గుహలో ఉంది. ఈ హింగోలా దేవిని హిందూవులతో పాటు మహమ్మదీయులు కూడా ఆరాధిస్తారు. మహమ్మదీయులు ఈ దేవిని 'బీబీనానీ' అంటారు. ఇచ్చుటి సరస్సులో సదా గాలిబుడగలు వెలువడుతూ ఉంటాయి. ఇచ్చుట దేవి మెదడు లేదా బ్రహ్మరంధ్రం పడిందంటారు. ఇచ్చుటి దేవిని 'కొట్టారి' అని శివుణ్ణి 'బీమలోచన' అని పిలుస్తారు.

ఈ క్షేత్రానికి సంబంధించిన ఒక కథ ఉంది. చాలాకాలం క్రితం అంధకాసురుని దౌర్జన్యం పెచ్చురిల్లడంతో దేవతలందరూ శివునికి మొరపెట్టుకున్నారు. శివుడు పార్వతిని ప్రార్థించమన్నాడు. అంధకాసురుడు దేవతలందరిని తిరస్కరిస్తూ, ఒకమారు మందరగిరికి వచ్చి పార్వతిని చూసి ఆమెను వశపరుచుకోవాలని తన సైన్యాన్ని మందరగిరికి పంపాడు.

అప్పుడు శివుడు నీకు కావలసిన పార్వతిని తీసుకువెళ్ళు కాని మందరగిరిని వదిలి పొమ్మంటాడు. శివుని అభిప్రాయాన్ని గ్రహించిన పార్వతి చేతనైనచో శివుణ్ణి

యుద్ధంలో ఓడించనున్నది. అంధకాసుర శివుల మధ్య యుద్ధం ప్రారంభమైంది. శివుని వరంతో అంధకాసురునికి విశేషమైన శక్తి ఉండేది. వాడి శరీరం నుండి రక్తబిందువు పడగానే వందలాదిమంది అంధకాసురులు పుడుతుండేవారు.

శివుడు అంధకాసురునితో పోరాడుతూ అలసిపోయాడు. అప్పుడు శివుని ఫాలభాగం నుండి చెమట చుక్క నేలపై పడింది. ఆ చెమట చుక్కనుండి 'చర్చికా, మంగళా' దేవతలు ఉద్భవించి వేలాది అంధకాసురుని రూపములను మ్రింగివేశారు. తర్వాత శివుడు తనమూడవకంటిని తెరచి అంధకారుని భస్మం చేశాడు.

తర్వాత చర్చికను ఆదిశక్తి రూపంలో మానవుల నుండి పూజలందుకొనునట్లు మంగళను నవగ్రహాలలో ఒకస్థానం లభించునట్లు వరమిచ్చాడు. ఈ రీతిగా చర్చిక వెలసిన స్థలమే నేటి హింగ్లాజ్. హింగ్లాజ్ అన్న పదానికి స్థానిక భాషలో రక్తం, ఎరుపురంగు, కుంకుమ అనే అర్థాలున్నాయి.

## టిబెట్‌లోని శక్తిపీఠాలు

### 49. మానస సరోవరంలోని దాక్షాయణిదేవి

టిబెట్ లోని ఒకే శక్తిపీఠం మానససరోవర సమీపంలోని కైలాస పర్వతం క్రింద ఉంది. ఇచ్చుటికి చేరుటకు టిబెట్ నుండి మానససరోవరం చేరాలి. ( లాసా నుండి దాదాపు 800 కి.మీ. దూరం)

మానసరోవరం దాదాపు 80 కిలోమీటర్ల చదరంతో విస్తారమైన మంచినీటి సరోవరం. భారతీయ హిందవులకు అత్యంత పవిత్రమైన స్థలం. ఈ సరోవరాన్ని చూసి ధన్యులు కావాలని ఏటా వేలాదిమంది హిందువులు ప్రయాస పూర్ణమైన యాత్రకోసం వెళ్లారు.

ఈ స్థలంలో దేవి కుడిచేయి పడిందని భక్తుల విశ్వాసం. దేవిని దాక్షాయణి' అని శివుణ్ణి 'అమర' అని పూజిస్తారు. ఇక్కడ విగ్రహానికి బదులుగా ఒక శిల ఉంది. ప్రత్యేక పూజలేమీ ఉండవు.

సంవత్సరంలో తొమ్మిది నెలలు ఇచ్చటికి రావటం ఎవరికీ సాధ్యం కాదు. మానససరోవరం చేరినపుడు భక్తుల పూజలు విశిష్టంగా ఉంటాయి. కొందరు పండిత పరిశోధకుల అభిప్రాయం ప్రకారం దేవి కుడిచేయిపడిన దాక్షాయణి క్షేత్రం ఇది కాదని, అది పశ్చిమబెంగాల్ లోని గుస్కర్ హౌరా నుండి రైలుమార్గం ద్వారా చేరగలం. అక్కడి నుండి కొన్ని కి.మీ. దూరంలో కోగ్రామ్ అన్నచోట ఈ దేవాలయం ఉంది.

### 50. శ్రీలంకలోని శక్తిపీఠం - నాగపూషణీదేవి

జాఫ్నాసమీపంలోవున్న నాగపూషణీదేవి ఆలయమే ఈ శక్తిపీఠం. జాఫ్నా నుండి కురిక్కాడ్ వన్ చేరిన పున్ కుడితీపు అన్నద్వీపం చేరగలం. ఇక్కడినుండి బస్సు సౌకర్యం ఉంది. నైన తీపులోని దేవిని ఇంద్రాక్షి అని, శివుడ్జి రక్తేశ్వర లేదా నాయనార్ అని పిలుస్తారు.

ఇచ్చట దేవి హస్తం పడిందని భక్తులు విశ్వసిస్తారు. కొందరు ఈ శక్తిపీఠం ట్రింకోమలిలోని త్రికోనేశ్వరం దేవాలయ పరిసరాల్లో ఉందన్నారు. ఈ స్థలంలో దేవి కాళ్ళ గజ్జెలు పడినాయని నమ్మకం.

ఏటా జూన్ 18న ఇక్కడ జరిగే ఉత్సవానికి, సంతానంలేని దంపతులువచ్చి నాగశాంతి పూజచేసి, మొక్కుబడి రూపంలో చిన్న ఊయలను చెట్టుకు వేలాడగడతారు. విమానం ద్వారా ట్రింకోమలి చేరవచ్చు. ఇచ్చట రావణాసురుని పూజిస్తారు. కొన్ని శక్తిపీఠాలు ఎక్కడ ఉంటున్నాయన్న వివరాలు ఖచ్చితంగా లభించలేదు. అలాంటి వాటిలో రెండు పీఠాలు క్రిందవి.

#### 51. పంచసాగర వారాహీదేవి

ఈ శక్తిపీఠంలో దేవి క్రింది దవడ పడిందని చెబుతారు. కొందరు హరిద్వారం వద్దనున్న క్షేత్రమని, మరికొందరు ఆల్మోరావద్ద ఉన్నదని చెబుతారు. ఇచ్చటి దేవతను వారాహి అని, శివుణ్ణి మహారుద్ర అని పిలుస్తారు. అయితే కాశీ క్షేత్రంలో వారాహీ అమ్మవారి ఆలయం భూగృహంలో వున్నది. ఇక్కడ పూజ సూర్యోదయానికి ముందే జరుగుతుంది. బహుశా ఈ వారాహీదేవియే శక్తిపీఠం కావచ్చు.

#### 52. కర్నాట్ లోని జయదుర్గాదేవి

హిమాచల్ ప్రదేశ్ లోని కాంలో ఉన్న కర్నాట్ లో దేవి రెండు చెవులూ పడినాయని భక్తుల నమ్మకం. ఇచ్చటి దేవిని 'జయదుర్గ' అని శివుణ్ణి 'అభీరు' అని పూజిస్తారు. శక్తి పీఠాల మహాత్యాన్ని తెలుసుకొని మనం జ్ఞానాన్ని, ధార్మిక మనస్తత్వాన్ని పెంచుకోవాలి.

# *51 శక్తి పీఠాలు, ప్రదేశాలు*

| స్థానము | అంగవివరము | అమ్మవారి పేరు | భైరవుడు | ప్రదేశము |
|---|---|---|---|---|
| హింగుళ | బ్రహ్మ రంధ్రము | కోఠారి | భీమలోచన భైరవుడు | పశ్చిమ పాకిస్తాన్ |
| కిరీట | కిరీటము | విమలా | సంవర్త భైరవుడు | గంగాతీరం బట్ నగర్ |
| బృందావన్ | కేశకలాప్ (జడ) | ఉమ | భూతేశ భైరవుడు | బృందావన్ |
| కరవీర | మూడు నేత్రములు | మహిషమర్దని | క్రోధాశ భైరవుడు | కొల్హపూర్ |
| సుంగంధ | నాశిక | సునంద | త్రయంబక భైరవుడు (తూర్పు పాకిస్తాన్) | సికార్‌పూర్ |
| కరతోయాతట | వామకర్ణం | అపర్ణ | వామన భైరవుడు (తూర్పు పాకిస్తాన్) | భవానీ పూర్ |
| శ్రీ పర్వత | దక్షిణ కర్ణం | శ్రీ సుందరి | సుందరానంద భైరవుడు | జైనాపూర్ |
| వారణాసి | కర్ణకుండలం | విశాలక్ష్మి | కాలభైరవుడు | కాశీ |
| గోదావరితీరం | ఎడమ బుగ్గ | విశ్వేశి | దండపాణి భైరవుడు | కోటి తీర్థము |
| గండకి | కుడిబుగ్గ | గండకి | చక్రపాణి భైరవుడు | ముక్తినాథ్ |
| శుచి | ఊర్ధ్వదంత పంక్తి | నారాయణి | సంహార భైరవుడు | శుచీంద్రం (కన్యాకుమారి) |

| | | | | |
|---|---|---|---|---|
| పంచసాగర | అధోదంత పంక్తి | వారాహి | మహారుద్ర భైరవుడు | కాశి |
| జ్వాలాముఖి | నాలుక | సొద్ధిద | ఉన్మత్త భైరవుడు | జ్వాలాముఖి (పంజాబ్) |
| భైరవ పర్వతం | పై పెదవి | అవంతి | లంబకర్ణ భైరవుడు | ఉజ్జయిని |
| అట్టహాస | క్రింద పెదవి | పుల్లార్ధ | విశ్వేశ భైరవుడు | లాభపూర్ |
| జనస్థాన్ | చుబుకము | భ్రమరి | వికృతాక్ష భైరవుడు | నాసిక్ |
| కాశ్మీర్ | కంఠ | మహామాయ | త్రిసంధ్యేశ్వర్ భైరవుడు | అమర్‌నాథ్ |
| నందిపూర్ | కంఠహారం | నందిని | నందికేశ్వర భైరవుడు | సౌదియస్టేషన్ |
| శ్రీశైల | మెడ | మహాలక్ష్మి | సంహారానంద భైరవుడు | భ్రమరాంబ దేవాలయం |
| సల్వాటి | నాభి | కాళికా | యోగీశ భైరవుడు | సల్వాటి స్టేషన్ |
| మిథిలా | ఎడమ భుజము | ఉమా | మహోదర భైరవుడు | పుష్పెట్ |
| రత్నావళి | కుడి భుజం | కుమారి | శివ భైరవుడు | మద్రాస్ |
| ప్రభాస | ఉదరం | చంద్రభాగ | వక్రతుండ భైరవుడు | గిరినార్ |
| జలంధర్ | వామస్థన | త్రిపుర మాలిని | భీషణ భైరవుడు | జలంధర్ |
| రామగిరి | దక్షిణస్థన | శివాని | చండ భైరవుడు | చిత్రకూటము |
| వైధ్యనాథ్ | హృదయం | జయదుర్గ | వైద్యనాథ్ భైరవుడు | దేవ్‌ఘర్ (జస్‌ది) |
| కన్యకాశ్రమ | పృష్ఠ భాగం | శర్వాణి | నిముష భైరవుడు | కన్యాకుమారి |
| వక్త్రేశ్వర్ | మనస్సు | మహిషమర్దని | వక్త్రనాథ భైరవుడు | దుబరాజ్ |

| | | | | |
|---|---|---|---|---|
| ఉజ్జయిని | ముంజేయి | మాంగల్యా చండికా | కపిలేశ్వర భైరవుడు | ఉజ్జయిని |
| మణివేదిక | మణికట్టు | గాయత్రి | శర్వానంద భైరవుడు | గాయత్రీ పర్వతం |
| మానస్ | కుడి చేయి | దాక్షాయణి | అసుర భైరవుడు | మానస సరోవరం |
| పసోర్ | ఎడమ చేయి | యశోరేశ్వరి | చండ భైరవుడు | ఖుల్‌న (తూర్పు పాకిస్తాన్) |
| ప్రయాగ | హస్తాంగుళి | లలిత | భవ భైరవుడు | ప్రయాగ |
| కాంచి | అస్థి | దేవగర్భ | రుద్ర హైరవుడు | శివకంచి |
| కాలమాధవ | వామనితంబము | కాళి | లలితాంగ భైరవుడు | నర్మద నదీ తీరం |
| శోణ | దక్షిణనితంబము | నర్మద | భద్రసేన భైరవుడు | అమరకంత |
| కామగిరి | యోని | కామాఖ్య | ఉమానాధ భైరవుడు | గౌహతి |
| నేపాల్ | మోకాళ్ళు | మహామాయ | కపాల భైరవుడు | ఖాట్మండ్ |
| జయంతి | ఎడమపిక్క | జయంతి | క్రమధీశ్వర భైరవుడు | బావర్ బాగ్ (అస్సాం) |
| మగధ | కుడిపిక్క | సర్వానందకరి | వ్యోమకేశ భైరవుడు | పాట్న |
| త్రిశోత | ఎడమపాదం | భ్రామరి | ఈశ్వర భైరవుడు | శాల్వాడి (బెంగాల్) |
| త్రిపుర | కుడిపాదం | త్రిపుర సుందరి | త్రిపురేశ భైరవుడు | రాధాకిషోర్ (త్రిపుర) |
| విభాష్ | ఎడమచీలమండలం | కపాలిని | సర్వానంద భైరవుడు | తమలుక్ (బెంగాల్) |
| కురుక్షేత్ర | కుడి చీలమండలం | సావిత్రి | స్థాణు భైరవుడు | కురుక్షేత్రం |
| లంకా | కాలిఅందె | ఇంద్రాక్షి | రాక్షసేశ్వర భైరవుడు | లంక |

| | | | | |
|---|---|---|---|---|
| యుగాయ | దక్షిణ పాదాంగుష్ఠం | భూతధాత్రి | క్షీరకంఠక భైరవుడు | క్షీర |
| విరాట | వామపాద అంగుళి | అంబికా | అమృత భైరవుడు | జైరాట్ (రాజస్థాన్) |
| కాళిపీఠ | శేష పాదాంగుళి | కాళికా | నకులీశ భైరవుడు | కలకత్తా |
| ఉత్కళవిరాజ | నాభి | విమలాదేవి | జగనాథ భైరవుడు | పూరి |
| కర్ణాట్ | కర్ణములు | జయదుర్గ | అభీరూ భైరవుడు | దర్శనముకు లేదు |
| చట్టల్ | బాహు | భవాని | చంద్రశేఖర భైరవుడు | సీతాకుండి (తూర్పుపాకిస్తాన్) |

లోకకళ్యాణార్థం శ్రీశ్రీశ్రీ జగద్గురు ఆది శంకరాచార్యులవారు సతీదేవి శరీర భాగములు పడిన కొన్ని ప్రదేశములలోనూ, మరికొన్ని ప్రాంతములలో ఉగ్రరూపిణి అయిన అమ్మవారిని శాంతింపచేసి, శ్రీచక్ర ప్రతిష్ట చేసారు. అవి అష్టాదశ శక్తి పీఠాలుగా ప్రసిద్ధి చెందాయి. అవి ఇలా ఉన్నాయి.

శ్రీశైలం శ్రీ భ్రమరాంబాదేవి (ఆంధ్రప్రదేశ్) అలంపురం, శ్రీ జోగులాంబాదేవి (మహారాష్ట్ర), ఉజ్జయిని శ్రీమహాకాళికాదేవి (మధ్యప్రదేశ్), హరిద్వార్ శ్రీమానసాదేవి (ఉత్తరాంచల్), ప్రయాగ మాధవేశ్వరీదేవి (ఉత్తరప్రదేశ్), వారణాశి శ్రీ విశాలక్ష్మీదేవి (ఆంధ్రప్రదేశ్), గయ శ్రీ మంగళగౌరీదేవి (బీహార్), కటక్ శ్రీ గిరిజాదేవి (ఒరిస్సా), పిఠాపురం, శ్రీ పురుహూతికాదేవి (ఆంధ్రప్రదేశ్), ద్రాక్షారామం శ్రీ మాణిక్యాంబాదేవి (ఆంధ్రప్రదేశ్), కాశ్మీర్ శ్రీ సరస్వతిదేవి (జమ్ముకాశ్మీర్), కాట్ర శ్రీ వైష్ణవీదేవి (జమ్ము కాశ్మీర్), గౌహతి శ్రీ కామరూపిదేవి (అస్సాం), మైసూర్ శ్రీ చాముండేశ్వరీదేవి (కార్ణటక), ప్రద్యుమ్నం శ్రీ శృంఖలాదేవి (పశ్చిమ బెంగాల్), ట్రింకోమలి శ్రీ శాంకరీదేవి (శ్రీలంక).

'ఓం' వారాణస్యాం విశాలాక్ష్యై 'నమః'
నైమిశే లింగధారిణ్యై
ప్రయాగే లలితాయై
గంధమాదనే కాముకాయై
మానసే (సరసి) కుముదాయై
విశ్వేశ్వరే విశ్వాయై
విశ్వకాయాం మాయై (లక్ష్మ్యై)
ఇచ్ఛాయాం మదనోత్కటాయై
గోమంతే గోమత్యై
మందారే కామచారిణ్యై. 10

చిత్రరథే మదోత్కటాయై
హస్తినాపురే జయంత్యై
కన్యాకుబ్జే గౌర్యై
మలయపర్వతే రమ్యాయై
హేమపత్సాసుని సందాయై
గోకర్ణే భద్రకర్ణికాయై
స్థాణీశ్వరే భవాన్యై
బిల్వకే బిల్వపత్రికాయై
శ్రీశైలే మాధవ్యై
భద్రేశ్వరే భద్రాయై 20

వరాహశైలే జయాయై
కమలాలయే కంబలాయై
పుష్కరే పురుహూతాయై
కేదారే మార్గదాయిన్యై
చంద్రకోట్యాం రుద్రాణ్యై
కాళంజరగిరౌ కాళ్యై
మహాలింగే కపిలాయై
మకుటే మకుటేశ్వర్యై
సాలగ్రామే మహాదేవ్యై
శివలింగే శివప్రియాయై 30

మాయాపుర్యాం కుమార్యై
లలితే సంతతాయై
ఉత్పలాక్షే సహస్రాక్ష్యై
మహోత్పలే హిరణ్యాక్ష్యై
గయాయాం మంగళాయై
పురుషోత్తమే విపులాయై
విపాశాయాం అమోఘాక్ష్యై
పుండ్రవర్ధనే పాటలాయై
సుపార్శ్వే నారాయణ్యై
త్రికూటే భద్రసుందర్యై 40

విపులే విపులాయై
మలయాచలే కల్యాణ్యై
కోటితీర్థే కోట్యక్ష్యై
మాధవనే సుగంధాయై
కుబ్జామ్రకే త్రిసంధ్యాయై
గంగాద్వారే రతిప్రియాయై

శివకుండే సునందాయై
దేవికాతటే నందిన్యై
ద్వారవత్యాం రుక్మిణ్యై
బృందావనే రాధాయై 50

మధురాయాం దేవక్యై
పాతాళే పరమేశ్వర్యై
చిత్రకూటే సీతాయై
వింధ్యే వింధ్యనివాసిన్యై
సహ్యాద్రౌ ఏకవీరాయై
హరిశ్చంద్రే చంద్రికాయై
రామతీర్థే రమణాయై
యమునాయాం మృగావత్యై
కరవీరే మహాలక్ష్మ్యై
వినాయకే ఉమాదేవ్యై 60

వైద్యనాథే ఆరోగ్యాయై
మహాకాళే మహేశ్వర్యై
శుక్లతీర్థే అభయాయై
వింధ్య కందరే స్మృత్యై
మాండవ్యే మాండక్యై
మాహేశ్వరే పురే స్వాహాయై
ఛాగలాండే ప్రచండాయై
అమరకంటకే చండికాయై
సోమేశ్వరే వరారోహాయై
ప్రభాసే పుష్కరావత్యై 70

సముద్రతటే సరస్వత్యాం దేవమాత్రే
మహాలయే మహాభాగాయై
పయోష్ణే పింగళావత్యై
కృతశౌచే సింహికాయై
కార్తికేయే యశస్కర్యై (శాంకర్యై)
ఉత్పలావర్తకే లోలాయై
సింధుసంగమే సుభద్రాయై
సిద్ధవనే లక్ష్మ్యై మాత్రే
భరతాశ్రమే అనంగాయై
జాలంధరే విశ్వముఖ్యై 80

కిష్కింధపర్వతే తారాయై
దేవదారువనే పుష్ట్యై
కాశ్మీరమండలే మేధాయై
హిమాద్రౌ ఉ(భీ) మాదేవ్యై
షష్ఠే వస్త్రేశ్వర్యై
కపాలమోచనే శుద్ధ్యై
కాయావరోహణే మాత్రే
శంఖద్వారే ధ్వన్యై
పిండారకే ధృత్యై
చంద్రభాగాయాం కలాయై 90

అచ్ఛోదే శూలాధారిణ్యై
వైణాయాం అమృతాయై
బదర్యాం ఊర్వశ్యై
ఉత్తరకురౌ ఓషధ్యై
కుశద్వీపే కుశోదక్యై
హేమకూటే మన్మథాయై
కుముదే సత్యవాదిన్యై
అశ్వత్థే (వృక్షే) వందనీయాయై

| | |
|---|---|
| వైశ్రవణా (కుబేరా)లయే నిధయే | సూర్యబింబే ప్రభాయై |
| వేదవదనే (వేదారంభే) గాయత్ర్యై 100 | మాతృకాసు వైష్ణవ్యై |
| శివసన్నిధౌ పార్వత్యై | సతీషు అరుంధత్యై |
| దేవలోకే ఇంద్రాణ్యై | రామాసు (స్త్రీషు)తిలోత్తమాయై |
| బ్రహ్మశరీరే సరస్వత్యై | సర్వశరీరిణాం చిత్తే బ్రహ్మకలా |
| | నామ్న్యైశక్తయే 108 |

(మత్స్యపురాణం 13వ అధ్యాయం)

ప్రతి నామమునకు ముందు 'ఓం' చివర 'నమః' చేర్చి పఠించవలెను

**అమ్మవారి 108 శక్తి పీఠాలు**

1.విశాలాక్ష్మి : కాశీ. వారణాసి జిల్లా. ఉత్తరప్రదేశ్. 2.లింగధారిణి - నైమిశారణ్యం. సీతాపూర్ జిల్లా. 25కి.మీ. బలమావూ రైల్వేస్టేషన్ ఉత్తరప్రదేశ్. 3.లలితాదేవి - ప్రయాగక్షేత్రం. అలాబాద్. త్రివేణీ సంగమం ఉత్తరప్రదేశ్. 4.కామాక్షిదేవి - గంధమాధన పర్వతం. రామనాధపురం జిల్లా. 4కి.మీ. రామేశ్వరం తమిళనాడు. 5.కుముదాదేవి - మానససరోవరం. కైలాస పర్వతమునానుకుని టిబెట్. 6.విశ్వకామ - అంబర్ (ఆమోర్) 7. గోమతి - గోమంత పర్వతం. గౌహతి. బ్రహ్మపుత్రా నదీతీరం. నీలాంచల పర్వతముపై వెలసిన కామాఖ్యదేవి. అస్సాం. 8.కామచారిణి - మందర పర్వతం. 9.మధోత్కట - చైత్రరథ వనం 10. జయంతి - హస్తినాపురం, ఢిల్లీ. 11. గౌరి – కన్యాకుజ్జం. కనౌజ్, ఫరూకాబాద్ జిల్లా. ఉత్తరప్రదేశ్ 12.రంభ - మలయాచలం. 13.కీర్తిమతి - ఏకామ్రకక్షేత్రం. కంచి, తమిళనాడు 14. విశ్వేశ్వరి విశ్వం - కాశీ, ఉత్తరప్రదేశ్. 15.పురూహూతా - పుష్కర్ లో, పిఠాపురం. ఆంధ్రప్రదేశ్. 16.మార్గదాయిని - కేదారం చమోలి జిల్లా. ఉత్తరప్రదేశ్ 17.నందహిమాచల

పర్వతము. నందాదేవి శిఖరం. 18.భద్ర కర్ణిక - గోకర్ణం. కర్నాటక. ఉత్తర కన్నడ జిల్లా, 19. భవాని - స్థాణేశ్వరం. కన్యాకుమారి అగ్రం. 13కి.మీ. శుచీంద్రం. తమిళనాడు. 20.బిళ్వపత్రిక : బిళ్వకం. 21.మాధవి - శ్రీశైలం, కర్నూలు జిల్లా, ఆంధ్రప్రదేశ్. 22. భద్ర - భద్రేశ్వర్. 23. జయ - వరాహశైలిపై 24.కమలాంబిక - కమలాలయ. - తిరువారూర్, తంజావూరుజిల్లా. తమిళనాడు. 25.రుద్రాణి - రుద్రకూటి. 26. కాళి కళంజర్ పర్వతం, కలకత్తా, పశ్చిమబెంగాల్. 27.కపిల సాలగ్రామ : మహాలింగంలో 28.ముకుటేశ్వరి : మార్కోట. 29.మహాదేవి : సాలగ్రామములో - ముక్తినాథ్ | గండకి, నేపాల్. 30.జలప్రియ : శివలింగములో 31.కుమారీ :మాయాపురి (హరిద్వారం) హరిద్వార్ జిల్లా. గంగాతీరం. ఉత్తరప్రదేశ్. 32.లలితా | అండిక - సంతాన క్షేత్రం. 33. ఉత్పలాక్షి - సహస్రాక్షలో - హిరణ్యాక్షలో 34.మహోత్పల - కమలాక్షలో 35. మంగళ గంగాతీరాన, గయ, బీహార్, గయ జిల్లా. 36.విమల - పురుషోత్తమ క్షేత్రం, పూరీ, బంగాళాఖాత తీరం. ఒరిస్సా 37.అమోఘాక్షి - వ్యాసనది/ విపాశనదీ తీరాన 38.పాటలా - పుండవర్ధనంలో 39.నారాయణి - సుపార్శ్వములో 40. భద్రసుందరి / రుద్రసుందరి - వికూట్లో త్రికూట్ లో 41. విపులేశ్వరి - విపులలో 42.కళ్యాణి - మలయాచలముపై 43.ఏకవీర - సహ్యాద్రి, కొల్లూరు, సహ్యాద్రి పర్వత మొదట్లో దక్షిణ కన్నడ జిల్లా, కర్నాటక 44.సుగంధా/చంద్రికా : మాధవ వనములో | హరిశ్చంద్రలో 45. త్రిసంధ్యా - కుబా మ్ర లో, ఋషీకేశ్, ఉత్తరప్రదేశ్ 46.రతిప్రియ – గంగా ద్వారములో, హరిద్వారం, ఉత్తరప్రదేశ్ 47.సునంద/సుఖనంద - శివ గుండములో 48. నందిని - దేవికాతీరాన, 49. రుక్మిణీ - ద్వారక, జామ్ నగర్ జిల్లా, గుజరాత్ 50.రాధా - బృందావనములో, బర్సానా, మధురజిల్లా, 51.దేవకి చాముండి - మధురలో, మధుర జిల్లా, ఉత్తరప్రదేశ్. 52.పరమేశ్వరి - పాతాళ లో, 53.సీత-చిత్రకూటం, సీతాపూర్ గ్రామం, 8కి.మీ. కరవీ రైల్వే స్టేషన్ బందా జిల్లా. పయోష్ణే నదీతీరం. ఉత్తరప్రదేశ్, 54. వింధ్యవాసిని - వింధ్యాచలం రైల్వేస్టేషన్ మీర్జాపూర్ జిల్లా. ఉత్తరప్రదేశ్, 55. ఏకవీర - సహ్యాచలముపై మాహోర్. నాందేడ్ జిల్లా 120కి.మీ. నాందేడ్, మహారాష్ట్ర, 56. చంద్రికా : హరిశ్చంద్రపై 57.రమణ - రామతీర్థములో 58.మృగవతీ - యమునా నదీతీరం. 59.మహాలక్ష్మి - కరవీరం. కొల్హాపూర్, కొల్హాపూర్ జిల్లా, మహారాష్ట్ర 60. ఉమాదేవి - వినాయకక్షేత్రం, పూనే, మహారాష్ట్ర 61. ఆరోగ్య - వైద్యనాథ్ లో, వైద్యనాథ్ ధామ్, 5కి.మీ. జెఓడి రైల్వేస్టేషన్ దేవగఢ్ జిల్లా. బీహార్. 62.మహేశ్వరి - మహాకాళములో వెస్ట్ మార్. 10కి.మీ. ఈ కసర్ వాడ్, వెస్ట్ మార్ జిల్లా, మధ్యప్రదేశ్. 63. అభయ - ఉష్ణతీర్థములో,64. అమృత - వింధ్య - కందారములో 65.మాండవీ

మాండవ్యలో, 66.స్వాహా : మహేశ్వరపురం (మహిష్మతి) 67. ప్రచండ - చెగలాండలో 68. చండిక - అమర్ కంటక్ : షాదోల్ జిల్లా, 50కి. మీ. షాదోల్ 50కి.మీ. బిలాస్ పూర్; నర్మద సోన్ నదుల జన్మస్థావరం. మధ్యప్రదేశ్, 69.వరా గోహ - సోమేశ్వరములో 70. పుష్కారావతీ - ప్రభాసలో, ప్రభాస తీర్థం. సోమనాథ్. 7కి.మీ. వీరావల్. జునాగఢ్ జిల్లా, గుజరాత్, 71.దేవమాత - సరస్వతీ - సముద్ర సంగమములో. 72.మహాభాగ - మహాలయంలో 73.పింగలేశ్వరి - పయోష్ణీ నదీతీరాన 74. సింహిక - కృతసౌచ్ లో, 75. యశస్కరి - కార్తికేయ క్షేత్రములో 76.లోలా/లీలా - ఉత్పలా వర్తములో 77.సుభద్ర - సోణ - గంగా సంగమములో 78.లక్ష్మీమాత - సిద్ధపూర్ లో 30కి.మీ. అహ్మదాబాద్, అహ్మదాబాద్ జిల్లా, గుజరాత్. 79. అంగనా | అనంగ - భరతాశ్రమములో, 80. విశ్వముఖి - జలంధర్ జలంధర్ జిల్లా, పంజాబ్ 81. తారా కిష్కింధాపర్వతముపై, హంపి. 10కి.మీ. హోస్పేట. బళ్ళారి జిల్లా, కర్నాటక 82. పుష్టి దేవదారు వనములో 83.మేధా - కాశ్మీర్ మండలములో వైష్ణవదేవి. 14కి.మీ. కాట్రా, ఉధంపూర్ జిల్లా, జమ్ము & కాశ్మీర్ 84.మాతా - కాయావరోహణలో, 88. ధ్వని | ధరా - శంఖోద్వార్ లో 89. ధృతి - పిండారకలో, 90.కాలా / కలా - చంద్రభాగ నదీతీరాన, భీమానది పుట్టినచోటు, భీమేశ్వరం, మహారాష్ట్ర, భీమానదికి చంద్రభాగ అని పేరు. 91. శివకారిణి | శివధారిణి - అచ్ఛోధలో 92. అమృతా - వేణా తీరాన 93. ఊర్వశి - బదరి వనములో బద్రీనాధ్, చమోలి జిల్లా, ఉత్తరప్రదేశ్, 94. ఓషధి - ఉత్తరకురులో, 95.కుశోదక - కుశాదీపములో 96. మన్మధా హేమకూట పర్వతము పై 97. సత్యవాదిని - ముకుట్ లో (కిరీటములో), రాజ్యా ధికారములో 98.వందనీయ - అశ్వట్ (పీపాల్)లో అశ్వత్థ వృక్షములో 99.నిధి కుబేర గృహ (అలంకాపురిలో) ధనవంతుల ఇండ్లలో, 100. గాయత్రి - వేదాలలో 101.పార్వతి (శివసాన్నిధ్యములో) 102. ఇంద్రాణి - దేవలోకములో 103.సరస్వతి - బ్రహ్మముఖములో, 104. ప్రభ - సూర్యమండలములో, 105.వైష్ణవి - మాతృకలలో, 106. అరుంధతి (పతివ్రతలలో) 107.తిలోత్తమ - రమణులలో, 108.శక్తి - దేహదారులలో,

## శ్రీ లలితా సహస్రనామ స్తోత్రమ్

ఓం అస్య శ్రీలలితాసహస్రనామ స్తోత్రమాలా మహామంత్రస్య వశిన్యాది వాగ్దేవతా ఋషయః అనుష్టుప్ఛందః శ్రీ లలితా పరాభట్టారికా మహాత్రిపురసుందరీ దేవతా, ఐం- బీజం, క్లీం శక్తిః, సౌః కీలకం, మమ చతుర్విధ ఫల పురుషార్థ సిద్ధ్యర్థే జపే వినియోగః, ఐం - అంగుష్ఠాభ్యాం నమః క్లీం - తర్జనీభ్యాం నమః సౌః - మధ్యమాభ్యాం నమః, సౌః- అనామికాభ్యాం నమః, క్లీం - కనిష్ఠికాభ్యాం నమః, ఐం - కరతలకరపృష్ఠాభ్యాం నమః, ఐం - హృదయాయ నమః, క్లీం-శిరసేస్వాహా, సౌః- శిఖాయై వషట్, సౌః కవచాయహుం , క్లీం-నేత్రత్రయాయ వౌషట్, ఐం-అస్త్రాయఫట్, భూర్భువస్సువరోమితి దిగ్బంధః

ధ్యానమ్ :

అరుణాం కరుణా తరంగితాక్షీం ధృతపాశాంకుశ పుష్పబాణచాపాం,

అణిమాదిభిరావృతాం మయూఖైః - అహమిత్యేవ విభావయే మహేశీమ్.

ధ్యాయేత్ పద్మాసనస్థాం వికసితవదనాం పద్మపత్రాయతాక్షీం,

హేమాభాం పీతవస్త్రాం కరకలిత లసద్ధేమపద్మాం వరాంగీమ్,

సర్వాలంకారయుక్తాం సకలమభయదాం భక్తనమ్రాం భవానీం

శ్రీవిద్యాం శాన్తమూర్తిం సకల సురనుతాం సర్వసంపత్ప్రదాత్రీమ్.

సకుంకుమవిలేపనా మళికచుమ్బికస్తూరికాం

సమన్దహసితేక్షణాం సశరచాప పాశాంకుశామ్

అశేషజనమోహినీ మరుణమాల్యభూషోజ్జ్వలాం

జపాకుసుమభాసురాం జపవిధౌ స్మరే దమ్బికామ్ !!

లమిత్యాది పంచపూజాం విభావయేత్. తద్యథా :- లం - పృథివీ

తత్త్వాత్మికాయై శ్రీ లలితాదేవ్యైగంధం పరికల్పయామి. హం -

ఆకాశ తత్త్వాత్మికాయై శ్రీ లలితాదేవ్యై పుష్పం పరికల్పయామి.

యం- వాయుతత్వాత్మికాయై శ్రీ లలితాదేవ్యై ధూపం పరికల్పయామి.

రం-వహ్నితత్త్వాత్మికాయై శ్రీ లలితాదేవ్యై దీపం పరికల్పయామి.

వం-అమృత తత్త్వాత్మికాయై శ్రీ లలితా దేవ్యై అమృత నైవేద్యం

పరికల్పయామి సం-సర్వతత్వాత్మికాయై శ్రీ లలితాదేవ్యై తాంబూలాది

సర్వోపచారాన్ పరికల్పయామి.

ఐం హ్రీం శ్రీం శ్రీమాత్రేనమః

శ్రీమాతా శ్రీమహారాజ్ఞీ శ్రీమత్సింహాసనేశ్వరీ

చిదగ్నికుండసమ్భూతా దేవకార్యసముద్యతా

ఉద్యద్భానుసహస్రాభా చతుర్బాహుసమన్వితా,

రాగస్వరూపపాశాఢ్యా క్రోధాకారాంకుశోజ్జ్వలా,

మనోరూపేక్షుకోదండా పంచతన్మాత్రసాయకా,

నిజారుణ ప్రభాపూర మజ్జద్బ్రహ్మాండ మండలా,

చమ్పకాశోకపున్నాగ సౌగన్ధికలసత్కచా,

కురువిందమణిశ్రేణీ కనత్కోటీర మండితా.

అష్టమీ చంద్రవిభ్రాజ దళికస్థల శోభితా,

ముఖచన్ద్ర కళంకాభ మృగనాభివిశేషకా.

వదనస్మరమాంగల్యగృహతోరణచిల్లికా,

వక్త లక్ష్మీపరీవాహ చలన్మీనాభలోచనా,

నవచంపకపుష్పాభ నాసాదండవిరాజితా,

తారాకాంతి తిరస్కారినాసాభరణభాసురా.

కదంబమంజరీ క్లుప్త కర్ణపూర మనోహరా,

తాటంకయుగళీభూతతపనోడుప మట్టిలా,

పద్మరాగశిలాదర్శపరిభావి కపోలభూః,
నవవిద్రుమ బింబశ్రీన్యక్కారి రదనచ్ఛదా,

శుద్ధవిద్యాంకురాకారద్విజపంక్తి ద్వయోజ్జ్వలా.
కర్పూర వీటికామోద సమాకర్షద్దిగంతరా.

నిజసల్లాప మాధుర్య వినిర్భర్త్సిత కచ్ఛపీ,
మందస్మిత ప్రభాపూర మజ్జత్కామేశ మానసా.

అనాకలిత సాదృశ్య చుబుక శ్రీ విరాజితా,
కామేశబద్ధ మాంగల్య సూత్ర శోభితకంధరా.

కనకాంగదకేయూర కమనీయభుజాన్వితా,
రత్నగ్రై వేయ చింతాకలోల ముక్తాఫలాన్వితా.

కామేశ్వర ప్రేమరత్నమణి ప్రతిపణస్తనీ,
నాభ్యాలవాల రోమాళిలతాఫలకుచద్వయీ,

లక్ష్యరోమలతాధారతా సమున్నేయ మధ్యమా,

స్తనభారదళన్మధ్య పట్టబద్ధవళిత్రయా.

అరుణారుణ కౌసుంభవస్త్ర భాస్వత్కటీతటీ,

రత్నకింకిణికారమ్యరశనా దామభూషితా.

కామేశజ్ఞాత సౌభాగ్య మార్దవోరుద్వయాన్వితా,

మాణిక్యమకుటాకార జానుద్వయవిరాజితా,

ఇంద్ర గోపపరిక్షిప్త స్మరతూణాభజంఘికా,

గూఢగుల్ఫా కూర్మపృష్ఠ జయిష్ణు ప్రపదాన్వితా.

నఖదీధితిసంఛన్ననమజ్జన తమోగుణా,

పదద్వయ ప్రభాజాలపరాకృతసరోరుహా,

శింజానమణిమంజీర మండిత శ్రీపదాంబుజా,

మరాళీమందగమనా మహాలావణ్యశేవధిః

సర్వారుణానవద్యాంగీ సర్వాభరణభూషితా,

శివకామేశ్వరాంకస్థా శివా స్వాధీనవల్లభా.

సుమేరుశృంగమధ్యస్థా శ్రీమన్నగర నాయికా,

చింతామణిగృహాంతస్థా పంచబ్రహ్మాసన స్థితా.

మహాపద్మాటవీసంస్థా కదంబవనవాసినీ,

సుధాసాగర మధ్యస్థా కామాక్షీ కామదాయినీ,

దేవర్షిగణసంఘాత స్తూయమానాత్మవైభవా,

భండాసురవధోద్యుక్త శక్తిసేనా సమన్వితా.

సంపత్కరీ సమారూఢ సింధురవ్రజసేవితా,

అశ్వారూఢాధిష్ఠితాశ్వకోటికోటిభిరావృతా.

చక్రరాజరథారూఢ సర్వాయుధపరిష్కృతా.

గేయచక్రరథారూఢ మంత్రిణీ పరిసేవితా

కిరిచక్రరథారూఢ దండనాథపురస్కృతా,

జ్వాలా మాలినికాక్షిప్త వహ్నిప్రాకారమధ్యగా,

భండసైన్యవధోద్యుక్త శక్తి విక్రమహర్షితా,

నిత్యాపరాక్రమాటోపనిరీక్షణసముత్సుకా.

భండపుత్రవధోద్యుక్త బాలావిక్రమనందితా,

మంత్రిణ్యంబావిరచితవిషంగవధతోషితా.

విశుక్రప్రాణహరణా వారాహీవీర్యనందితా,

కామేశ్వరముఖాలోకకల్పిత శ్రీ గణేశ్వరా.

మహాగణేశనిర్భిన్నవిఘ్నయంత్ర ప్రహర్షితా,

భండాసురేంద్ర నిర్ముక్తశస్త్రప్రత్యస్త్రవర్షిణీ.

కరాంగులినఖోత్పన్న నారాయణదశాకృతికి,

మహాపాశుపతాస్త్రాగ్నినిర్ధగ్ధాసురసైనికా.

కామేశ్వరాస్త్ర నిర్దగ్ధసభండాసుర శూన్యకా,

బ్రహ్మోపేంద్ర మహేంద్రాదిదేవసంస్తుతవైభవా

హరనేత్రాగ్ని సందగ్ధకామసంజీవనౌషధిః,
శ్రీమద్వాగ్భవకూటైక స్వరూపముఖపంకజా,

కంఠాధః కటిపర్యంతమధ్యకూటస్వరూపిణీ,
శక్తికూటైకతాపన్న కట్య ధోభాగధారిణీ..

మూలమంత్రాత్మికా మూలకూటత్రయ కళేబరా,
కులామృతైక రసికా కులసంకేతపాలినీ.

కుళాంగనా కుళాంతస్థా కౌళినీ కులయోగినీ,
అకుళా సమయాంతస్థా సమయాచారతత్పరా.

మూలాధారైక నిలయా బ్రహ్మగ్రంథివిభేదినీ,
మణిపూరాంతరుదితా విష్ణుగ్రంథివిభేదినీ,

ఆజ్ఞాచక్రాంతరాళస్థా రుద్రగ్రంథి విభేదినీ,
సహస్రారాంబుజారూఢా సుధాసారాభివర్షిణీ.

తటిల్లతాసమరుచి షట్చక్రోపరిసంస్థితా
మహాశక్తిః కుండలినీ బిసతంతు తనీయసీ.

భవానీ భావనాగమ్యా భవారణ్య కుఠారికా,
భద్రప్రియా భద్రమూర్తి రక్తసౌభాగ్యదాయినీ.

భక్తప్రియా భక్తిగమ్యా భక్తివశ్యా భయాపహా,
శాంభవీ శారదారాధ్యా శర్వాణీ శర్మదాయినీ.

శాంకరీ శ్రీకరీ సాధ్వీ శరచ్చంద్రనిభాననా,
శాతోదరీ శాంతిమతీ నిరాధారా నిరంజనా.

నిర్లేపా నిర్మలా నిత్యా నిరాకారా నిరాకులా,
నిర్గుణా నిష్కళా శాంతా నిష్కామా నిరుపప్లవా.

నిత్యముక్తా నిర్వికారా నిష్ప్రపంచా నిరాశ్రయా,
నిత్యశుద్ధా నిత్యబుద్ధా నిరవద్యా నిరంతరా.

నిష్కారణా నిష్కళంకా నిరుపాధి ర్నిరీశ్వరా,

నీరాగా రాగమథనీ నిర్మదా మదనాశినీ.

నిశ్చింతా నిరహంకారా నిర్మోహా మోహనాశినీ,

నిర్మమా మమతాహంత్రీ నిష్పాపా పాపనాశినీ.

నిష్క్రోధా క్రోధశమనీ నిర్లోభా లోభనాశినీ,

నిస్సంశయా సంశయఘ్నీ నిర్భవా భవనాశినీ.

నిర్వికల్పా నిరాబాధా నిర్భేదా భేదనాశినీ,

నిర్నాశా మృత్యుమథనీ నియా నిష్పరిగ్రహా,

నిస్తులా నీలచికురా నిరపాయా నిరత్యయా,

దుర్లభా దుర్గమా దుర్గా దుఃఖహంత్రీ సుఖప్రదా,

దుష్టదూరా దురాచారశమనీ దోషవర్జితా,

సర్వజ్ఞా సాంద్రకరుణా సమానాధికవర్జితా.

సర్వశక్తిమయీ సర్వమంగళా సద్గతిప్రదా,

సర్వేశ్వరీ సర్వమయీ సర్వమంత్రస్వరూపిణీ.

సర్వయంత్రాత్మికా సర్వతంత్రరూపా మనోన్మనీ,
మహేశ్వరీ మహాదేవీ మహాలక్ష్మీ ర్మృడప్రియా.

మహారూపా మహాపూజ్యా మహాపాతకనాశినీ,
మహామాయా మహాసత్వా మహాశక్తి ర్మహారతిః

మహాభోగా మహైశ్వర్యా మహావీర్యా మహాబలా,
మహాబుద్ధి ర్మహాసిద్ధి ర్మహాయోగీశ్వరేశ్వరీ.

మహాతంత్రా మహామంత్రా మహాయంత్రా మహాసనా,
మహాయాగక్రమారాధ్యా మహాభైరవపూజితా.

మహేశ్వరమహాకల్పమహాతాండవసాక్షిణీ,
మహాకామేశమహిషీ మహాత్రిపురసుందరీ.

చతుష్షష్ట్యుపచారాఢ్యా చతుష్షష్టి కళామయీ,
మహాచతుష్షష్టికోటియోగినీగణసేవితా.

మనువిద్యా చంద్రవిద్యా చంద్రమండలమధ్యగా,

చారురూపా చారుహాసా చారు చంద్రకళాధరా.

చరాచర జగన్నాథ చక్రరాజనికేతనా,

పార్వతీ పద్మనయనా, పద్మరాగసమప్రభా,

పంచప్రేతాసనాసీనా పంచబ్రహ్మ స్వరూపిణీ,

చిన్మయీ పరమానందా విజ్ఞానఘనరూపిణీ.

ధ్యానధ్యాతృధ్యేయరూపా ధర్మాధర్మ వివర్జితా,

విశ్వరూపా జాగరిణీ స్వపంతీ తైజసాత్మికా.

సుప్తా ప్రాజ్ఞాత్మికా తుర్యా సర్వావస్థా వివర్జితా,

సృష్టికర్త్రీ బ్రహ్మరూపా గోప్త్రీ గోవిందరూపిణీ.

సంహారిణీ రుద్రరూపా తిరోధానకరీశ్వరీ,

సదాశివానుగ్రహదా పంచకృత్యపరాయణా.

భానుమండలమధ్యస్థా భైరవీ భగమాలినీ,

పద్మాసనా భగవతీ పద్మనాభసహోదరీ.

ఉన్మేషనిమిషోత్పన్నవిపన్నభువనావళిః,

సహస్రశీర్షవదనా సహస్రాక్షీ సహస్రపాత్.

ఆబ్రహ్మకీటజననీ వర్ణాశ్రమ విధాయినీ

నిజారూపనిగమా పుణ్యాపుణ్యఫలప్రదా

శ్రుతిసీమంత సిందూరీకృతపాదాబ్జధూళికా,

సకలాగమసందోహశుక్తి సంపుటమౌక్తికా.

పురుషార్థ ప్రదా పూర్ణాభోగినీ భువనేశ్వరీ,

అంబికానాదినిధనా హరిబ్రహ్మేంద్రసేవితా.

నారాయణీ నాదరూపా నామరూపవివర్జితా.

హ్రీంకారీ హ్రీమతీ హృద్యా హేయోపాదేయవర్జితా!

రాజరాజార్చితా రాజ్ఞై రమ్యా రాజీవలోచనా,

రంజనీ రమణీ రస్యా రణత్కింకిణిమేఖలా

రమా రాకేందువదనా రతిరూపా రతిప్రియా,

రక్షాకరీ రాక్షసఘ్నీ రామా రమణలంపటా.

కామ్యాకామకలారూపా కదంబకుసుమప్రియా,

కల్యాణీ జగతీకందా కరుణారససాగరా.

కళావతీ కళాలాపా కాంతా కాదంబరీ ప్రియా,

వరదా వామనయనా వారుణీ మదవిహ్వలా.

విశ్వాధికా వేదవేద్యా వింధ్యాచలనివాసినీ,

విధాత్రీ వేదజననీ విష్ణుమాయావిలాసినీ.

క్షేత్రస్వరూపా క్షేత్రేశీ క్షేత్ర క్షేత్రజ్ఞపాలినీ,

క్షయవృద్ధి వినిర్ముక్తా క్షేత్రపాలసమర్చితా.

విజయా విమలా వన్యా వన్దారుజనవత్సలా,

వాగ్వాదినీ వామకేశీ వహ్నిమణాలవాసినీ.

భక్తిమత్కల్పలతికా పశుపాశవిమోచనీ,

సంహృతాశేషపాషణా సదాచారప్రవర్తికా.

తాపత్రయాగ్ని సంతప్త సమాహ్లాదనచంద్రికా,

తరుణీ తాపసారాధ్యా తనుమధ్యా తమోపహా.

చితి సత్పదలక్ష్యార్థా చిదేకరసరూపిణీ,

స్వాత్మానందలవీ భూతబ్రహ్మాద్యానర్ధసన్తతిః,

పరా ప్రత్యక్క్రితీరూపా పశ్యనీ పరదేవతా,

మధ్యమా వైఖరీరూపా భక్తమానస హంసికా.

కామేశ్వరప్రాణనాడీ కృతజ్ఞా కామపూజితా,

శృంగారససంపూర్ణా జయా జాలస్థరస్థితా,

ఓడ్యాణపీఠనిలయా బిందుమణలవాసినీ,

రహోయాగక్రమారాధ్యా రహస్తర్పణతర్పితా.

సద్యః ప్రసాదినీ విశ్వసాక్షిణీ సాక్షివర్జితా,

షడంగ దేవతాయుక్తా షాఢుణ్యపరిపూరితా,

నిత్యక్లిన్నా నిరుపమా నిర్వాణసుఖదాయినీ,

నిత్యాషోడశికారూపా శ్రీకంఠార్ధశరీరిణీ.

ప్రభావతీ ప్రభారూపా ప్రసిద్ధా పరమేశ్వరీ,

మూలప్రకృతి రవ్యక్తా వ్యక్తావ్యక్తస్వరూపిణీ.

వ్యాపినీ వివిధాకార విద్యావిద్యా స్వరూపిణీ,

మహాకామేశ నయన కుముదాహ్లాదకౌముదీ,

భక్తహార్ద తమోభేద భానుమద్భానుసంతతిః,

శివదూతీ శివారాధ్యా శివమూర్తి శ్శివంకరీ.

శివప్రియా శివపరా శిష్టష్టా ఇష్టపూజితా,

అప్రమేయా స్వప్రకాశ మనోవాచామగోచరా.

చిచ్ఛక్తి శ్చేతనారూపా జడశక్తిర్జడాత్మికా,

గాయత్రి వ్యాహృతి స్సంధ్యా ద్విజబృంద నిషేవితా.

తత్వాసనా తత్త్వమయీ పంచకోశాంతరస్థితా,

నిస్సీమ మహిమా నిత్యయౌవనా మదశాలినీ.

మదఘూర్ణితరక్తాక్షీ మదపాటలగండభూః,

చందనద్రవదిగ్ధాంగీ చాంపేయకుసుమప్రియా.

కుశలా కోమలాకారా కురుకుళ్ళా కుళేశ్వరీ,

కుళకుండాలయా కౌళమార్గతత్పరసేవితా,

కుమార గణనాథాంబా తుష్టిః పుష్టిర్మతిర్ధృతిః,

శాంతి స్స్వస్తిమతీ కాంతి ర్నందినీ విఘ్ననాశినీ,

తేజోవతీ త్రినయనా లోలాక్షీ కామరూపిణీ

మాలినీ హంసినీ మాతా మలయాచలవాసినీ,

సుముఖీ నళినీ సుభ్రూశ్శోభనా సురనాయికా,

కాలకంఠ కాంతిమతీ క్షోభిణీ సూక్ష్మరూపిణీ.

వజ్రేశ్వరీ వామదేవీ వయోవస్థా వివర్జితా,

సిద్ధేశ్వరీ సిద్ధవిద్యా సిద్ధమాతా యశస్వినీ.

విశుద్ధచక్ర నిలయా రక్తవర్ణా త్రిలోచనా,

ఖట్వాంగాది ప్రహరణా వదనైక సమన్వితా.

పాయసాన్న ప్రియా త్వక్ స్థా పశులోకభయంకరీ,

అమృతాది మహాశక్తి సంవృతా ఢాకినీశ్వరీ.

అనాహతాబ్జనిలయా శ్యామాభా వదనద్వయా,

దంష్ట్రోజ్జ్వలాక్షమాలాది ధరా రుధిరసంస్థితా.

కాళరాత్ర్యాదిశక్త్యాఘవృతా స్నిగ్ధౌదనప్రియా,

మహావీరేంద్రవరదా రాకిన్యంబా స్వరూపిణీ.

మణిపూరాబ్జనిలయా వదనత్రయసంయుతా,

వజ్రాదికాయుధోపేతా డామర్యాదిభిరావృతా.

రక్తవర్ణా మాంసనిష్ఠా గుడాన్న ప్రీతమానసా,

సమస్తభక్త సుఖదా లాకిన్యంబా స్వరూపిణీ.

స్వాధిష్టానాంబుజగతా చతుర్వక్త్ర మనోహరా,

శూలాద్యాయుధసంపన్నా పీతవర్ణాతిగర్వితా.

మేదోనిషా మధుప్రీతా బందిన్యాదిసమన్వితా,

దధ్యన్నాసక్త హృదయా డాకినీ రూపధారిణీ.

మూలాధారాంబుజారూఢా పంచవక్త్రాస్థిసంస్థితా,

అంకుశాదిప్రహరణా వరదాదినిషేవితా,

ముగ్గేదనాసక్తచిత్తా సాకిన్యంబాస్వరూపిణీ,

ఆజ్ఞాచక్రాబ్దనిలయా శుక్లవర్ణా షడాసనా.

మజ్జి సంస్థా హంసవతీ ముఖ్యశక్తి సమన్వితా,

హరిద్రాన్నైకరసికా హాకినీరూపధారిణీ.

సహస్రదళ పద్మమే సర్వవరోపశోభితా,

సర్వాయుధధరా శుక్ల సంస్థితా సర్వతోముఖీ.

సర్వోదన ప్రీతచిత్తా యాకిన్యాంబా స్వరూపిణీ,
స్వాహా స్వధా మతిర్మేధా శ్రుతిః స్మృతి రనుత్తమా.

పుణ్యకీర్తిః పుణ్యలభ్యా పుణ్య శ్రవణకీర్తనా,
పులోమజార్చితా బంధమోచనీ బంధురాలకా.

విమర్శరూపిణీ విద్యా వియదాది జగత్ప్రసూః ,
సర్వవ్యాధి ప్రశమనీ సర్వమృత్యునివారిణీ.

అగ్రగణ్యా చింత్యరూపా కలికల్మషనాశినీ,
కాత్యాయనీ కాలహంత్రీ కమలాక్షనిషేవితా,

తాంబూలపూరితముఖీ దాడి మీకుసుమప్రభా,
మృగాక్షీమోహినీ ముఖ్యామృడానీ మిత్రరూపిణీ.

నిత్యతృప్తా భక్తనిధిర్నియంత్రీ నిఖిలేశ్వరీ,
మైత్ర్యాదివాసనాలభ్యా మహాప్రళయసాక్షిణీ.

పరాశక్తిః పరానిష్ఠా ప్రజ్ఞానఘనరూపిణీ,

మాధ్వీపానాలసా మత్తా మాతృకా వర్ణరూపిణీ.

మహాకైలాసనిలయా మృణాళమృదుదోర్లతా,

మహనీయా దయామూర్తి ర్మహాసామ్రాజ్యశాలినీ.

ఆత్మవిద్యా మహావిద్యా శ్రీ విద్యా కామసేవితా,

శ్రీ షోడశాక్షరీవిద్యా త్రికూటా కామకోటికా.

కటాక్షకింకరీభూతకమలా కోటిసేవితా శిరస్థితా

చంద్రని ఫాలసేంద్ర ధను:ప్రభా.

హృదయస్థా రవి ప్రఖ్యా త్రికోణాంతర దీపికా,

దాక్షాయణీ దైత్యహంత్రీ దక్షయజ్ఞ వినాశినీ.

దరాందోళిత దీర్ఘాక్షీ దరహాసోజ్జ్వలన్ముఖీ,

గురుమూర్తిర్గుణనిధోమాతా గుహజన్మభూః

దేవేశీ దండనీతిస్థా దహరాకాశరూపిణీ,

ప్రతిపన్ముఖ్యరాకాంతతిథిమండలపూజితా.

కళాత్మికా కళానాథా కావ్యాలాపవినోదినీ,

సచామరరమావాణీసవ్యదక్షిణసేవితా.

ఆదిశక్తి రమేయాత్మా పరమా పావనాకృతిః,

అనేకకోటి బ్రహ్మాండజననీ దివ్యవిగ్రహా.

క్లీంకారీ కేవలా గుహ్యా కైవల్యపదదాయినీ,

త్రిపురా త్రిజగద్వంద్యా త్రిమూర్తి స్త్రిదశేశ్వరీ.

త్ర్యక్షరీ దివ్యగంధాద్యా సింధూర తిలకాంచితా,

ఉమా శైలేంద్రతనయా గౌరీ గంధర్వసేవితా,

విశ్వగర్భా స్వర్ణగర్భా వరదా వాగధీశ్వరి,

ధ్యానగమ్యా పరిచ్ఛేద్యా జ్ఞానదా జ్ఞానవిగ్రహా,

సర్వవేదాంతసంవేద్యా సత్యానందస్వరూపిణీ,

లోపాముద్రార్చితా లీలా క్లుప్త బ్రహ్మాండ మండలా.

అదృశ్యా దృశ్యరహితా విజ్ఞాత్రీ వేద్యవర్జితా,

యోగినీ యోగదా యోగ్యా యోగానందా యుగంధరా.

ఇచ్ఛాశక్తి జ్ఞానశక్తి క్రియాశక్తి స్వరూపిణీ,

సర్వాధారా సుప్రతిష్ఠా సదసద్రూపధారిణీ.

అష్టమూర్తి రజాజైత్రీ లోక యాత్రా విధాయినీ,

ఏకాకినీ భూమరూపా నిర్ద్వైతా ద్వైతవర్జితా.

అన్నదా వసుధా వృద్ధా బ్రహ్మాత్మైక్య స్వరూపిణీ,

బృహతీ బ్రాహ్మణీ బ్రాహ్మీ బ్రహ్మానంద బలిప్రియా.

భాషారూపా బృహత్సేనా భావాభావవివర్జితా,

సుఖారాధ్యా శుభకరీ శోభనా సులభాగతిః

రాజరాజేశ్వరీ రాజ్యదాయినీ రాజ్యవల్లభా,

రాజత్కృపా రాజపీఠనివేశిత నిజాశ్రితా

రాజ్యలక్ష్మీః కోశనాథా చతురంగబలేశ్వరీ,

సామ్రాజ్యదాయినీ సత్యసంధా సాగరమేఖలా.

దీక్షితా దైత్యశమనీ సర్వలోకవశంకరీ,

సర్వార్ధదాత్రీ సావిత్రీ సచ్చిదానందరూపిణీ.

దేశకాలాపరిచ్ఛిన్నా సర్వగా సర్వమోహినీ,

సరస్వతీ శాస్త్రమయీ గుహాంబా గుహ్య రూపిణీ.

సర్వోపాధివినిర్ముక్తా సదాశివపతివ్రతా,

సంప్రదాయేశ్వరీ సాధ్వీ గురుమండలరూపిణీ.

కులోత్తీర్ణా భగారాధ్యా మాయా మధుమతీ మహీ,

గణాంబా గుహ్యకారాధ్యా కోమలాంగీ గురుప్రియా,

స్వతంత్రా సర్వతంత్రేశీ దక్షిణామూర్తి రూపిణీ,

సనకాదిసమారాధ్యా శివజ్ఞాన ప్రదాయినీ.

చిత్కాళానందకలికా ప్రేమరూపా ప్రియంకరీ,

నామపారాయణప్రీతా నంది విద్యా నటేశ్వరీ.

మిథ్యాజగదధిష్టానా ముక్తిదా ముక్తిరూపిణీ,

లాస్యప్రియా లయకరీ లజ్జా రంభాదివందితా.

భవదావసుధావృష్టిః పాపారణ్యదవానలా,

దౌర్భాగ్యతూలవాతూలా జరాధ్వాంతరవిప్రభా,

భాగ్యాబ్ధిచంద్రికా భక్త చిత్తకేకిఘనాఘనా,

రోగపర్వతదంభోళి ర్మృత్యుదారుకుఠారికా.

మహేశ్వరీ మహాకాళీ మహాగ్రాసా మహాశనా,

అపర్ణాచండికా చండముండాసురనిషూదినీ.

క్షరాక్షరాత్మికా సర్వలోకేశీ విశ్వధారిణీ,

త్రివర్గదాత్రీ సుభగా త్ర్యంబకా త్రిగుణాత్మికా

స్వర్గాపవర్గదా శుద్ధా జపాపుష్పనిభాకృతిః,

ఓజోవతీ ద్యుతిధరా యజ్ఞరూపా ప్రియవ్రతా.

దురారాధ్యాదురాధర్షా పాటలీకుసుమప్రియా,

మహతీ మేరునిలయా మందారకుసుమప్రియా.

వీరారాధ్యా విరాడ్రూపా విరజా విశ్వతోముఖీ,

ప్రత్యగ్రూపా పరాకాశా ప్రాణదా ప్రాణరూపిణీ.

మార్తాండ భైరవారాధ్యా మంత్రిణీన్యగరాజ్యధూః,

త్రిపురేశీజయత్సేనా నిన్రిగుణ్యా పరాపరా.

సత్యజ్ఞానానందరూపా సామరస్యపరాయణా,

కపర్దినీ కళామాలా కామధుక్కామరూపిణీ.

కళానిధిః కావ్యకళా రసజ్ఞా రససేవధిః,

పుష్టా పురాతనా పూజ్యా పుష్కరా పుష్కరేక్షణా.

పరంజ్యోతిః పరంధామ పరమాణుః పరాత్పరా,

పాశహస్తా పాశహంత్రీ పరమంత్రవిభేదినీ.

మూర్తామూర్తా నిత్యతృప్తా మునిమానసహంసికా
సత్యవ్రతా సత్యరూపా సర్వాంతర్యామినీ సతీ.

బ్రహ్మాణీ బ్రహ్మజననీ బహురూపా బుధార్చితా,
ప్రసవిత్రీ ప్రచండాజ్ఞా ప్రతిష్ఠా ప్రకటాకృతిః.

ప్రాణేశ్వరీ ప్రాణదాత్రీ పంచాశత్పీఠరూపిణీ,
విశృంఖలా వివిక్త వీరమాతా వియత్ప్రసూః

ముకుందా ముక్తి నిలయా మూలవిగ్రహరూపిణీ,
భావజ్ఞా భవరోగఘ్నీ భవచక్ర ప్రవర్తినీ,

ఛందస్సారా శాస్త్రసారా మంత్రసారా తలోదరీ,
ఉదారకీర్తి రుద్దామవైభవా వర్ణరూపిణీ.

జన్మమృత్యుజరాతప్తజనవిశ్రాంతిదాయినీ,
సర్వోపనిషదుదుష్టా శాంత్యతీతకళాత్మికా.

గంభీరా గగనాంతస్థా గర్వితా గానలోలుపా,

కల్పనారహితా కాష్ఠా కాంతా కాంతార్ధవిగ్రహా.

కార్యకారణనిర్ముక్తా కామకేళితరంగితా,

కనత్కనకతాటంకా లీలావిగ్రహధారిణీ.

అజా క్షయవినిర్ముక్తా ముగ్ధాక్షిప్ర ప్రసాదినీ,

అంతర్ముఖసమారాధ్యా బహిర్ముఖ సుదుర్లభా.

త్రయీ త్రివర్గనిలయా త్రిస్థా త్రిపురమాలినీ,

నిరామయా నిరాలంబా స్వాత్మారామా సుధాసృతిః

సంసారపంకనిర్మగ్నసముద్ధరణపండితా,

యజ్ఞప్రియా యజ్ఞకర్త్రీ యజమానస్వరూపిణీ.

ధర్మాధారా ధనాధ్యక్షా ధనధాన్యవివర్థినీ,

విప్రప్రియా విప్రరూపా విశ్వభ్రమణకారిణీ.

విశ్వగ్రాసా విద్రుమాభా వైష్ణవీ విష్ణురూపిణీ,

అయోనిర్యోనినిలయా కూటస్థా కులరూపిణీ.

వీరగోష్ఠీప్రియా వీరా నైష్కర్మ్యా నాదరూపిణీ,

విజ్ఞానకలనా కల్యా విదగ్ధ బైందవాసనా.

తత్త్వాధికా తత్త్వమయీ తత్త్వమర్థస్వరూపిణీ,

సామగానప్రియా సౌమ్యా సదాశివకుటుంబినీ.

సవ్యాపసవ్యమార్గస్థా సర్వాపద్వినివారిణీ,

స్వస్థ స్వభావమధురా ధీరా ధీరసమర్చితా.

చైతన్యార్ఘ్యసమారాధ్యా చైతన్యకుసుమప్రియా,

సదోదితా సదాతుష్టా తరుణాదిత్య పాటలా,

దక్షిణా దక్షిణారాధ్యా దరస్మేరముఖాంబుజా,

కౌళినీ కేవలానర్ఘకైవల్య పదదాయినీ.

స్తోత్రప్రియా స్తుతిమతీ శ్రుతిసంస్తుతవైభవా,

మనస్వినీ మానవతీ మహేశీ మంగళాకృతిః

విశ్వమాతా జగద్ధాత్రీ విశాలాక్షీ విరాగిణీ,

ప్రగల్భా పరమోదారా పరామోదా మనోమయీ.

వ్యోమకేశీ విమాన వజ్రిణీ వామకేశ్వరీ,

పంచయజ్ఞప్రియా పంచప్రేతమంచాధిశాయినీ.

పంచమీ పంచభూతేశీ పంచసంఖ్యోపచారిణీ,

శాశ్వతీ శాశ్వతైశ్వర్యా శర్మదా శంభుమోహినీ.

ధరాధరసుతా ధన్యా ధర్మిణీ ధర్మవర్ధినీ,

లోకాతీతా గుణాతీతా సర్వాతీతా శమాత్మికా.

బంధూకకుసుమప్రఖ్యా బాలా లీలావినోదినీ,

సుమంగళీ సుఖకరీ సువేషాఢ్యా సువాసినీ,

సువాసిన్యర్చన ప్రీతా శోభనా శుద్ధమానసా,

బిందుతర్పణసంతుష్టా పూర్వజా త్రిపురాంబికా,

దశముద్రా సమారాధ్యా త్రిపురా శ్రీవశంకరీ,

జ్ఞానముద్రా జ్ఞానగమ్యా జ్ఞానజ్ఞేయస్వరూపిణీ.

యోనిముద్రా త్రిఖండేశీ త్రిగుణాంబా త్రికోణగా,

అనఘాద్భుత చారిత్రా వాంఛితార్థ ప్రదాయినీ.

అభ్యాసాతిశయజ్ఞాతా షడధ్వాతీతరూపిణీ,

అవ్యాజకరుణామూర్తి రజ్ఞానధ్వాంతదీపికా.

ఆబాలగోపవిదితా సర్వానుల్లంఘ్యశాసనా,

శ్రీ చక్రరాజనిలయా శ్రీమతిపురసుందరీ.

శ్రీశివా శివశక్త్యైక్య రూపిణీ లలితాంబికా,

ఏవం శ్రీలలితాదేవ్యా నామ్నాం సాహస్రకం జగుః

*ఇతి శ్రీ బ్రహ్మాండపురాణే, ఉత్తరఖండే శ్రీ హయగ్రీ నాగస్య సంవాదే*

*శ్రీ లలితా రహస్యదాయ సాహస పోత కథనం నాకు ద్వితీయోధ్యాయః*

**అష్టోత్తరశత శక్తిపీఠ స్తోత్రం**

సకల దేవతలందరికీ ఆవాసస్థానమైన మన పవిత్ర భారతదేశంలో ఆది ప్రకృతి స్వరూపిణి తన అంశావతారాలతో, ఎన్నో రూపాల్ని ధరించి ఎన్నోచోట్ల కొలువుదీరి పూజలందుకుంటోంది. అయితే ఈ క్షేత్రాలన్నిట్లో ప్రసిద్ధిచెందిన దేవీక్షేత్రాలు మొత్తం నూటెనిమిది. వీటినే అష్టోత్తర శతశక్తిపీఠాలని అంటారు. ఈ పీఠాలు ఎక్కడ వున్నాయి. ఆ పీఠాల్లోని శక్తి పేరేమిటి? అనే విషయాన్ని స్తోత్రరూపంలో పద్మపురాణంలో చెప్పటం జరిగింది. ఈ స్తోత్రాన్ని గనక మనం ఒక్కసారి పఠిస్తే నూటెనిమిది దేవి శక్తులన్నింటికీ ఒకేసారి పూజచేసినంత ఫలం లభిస్తుంది.

**వారణాస్యాం విశాలాక్షీ నైమిషే లింగధారిణే |**

**ప్రయాగే లలితాదేవీ కాముకా గంధమాదనే || 1**

**మానసే కుముదా నామ విశ్వకాయా తథా2_0బరే |**

**గోమంతే గోమతీ నామ మందరే కామచారిణీ ||2**

**మదోత్కటాచైత్రరథే జయంతీ హస్తినాపురే |**

**కాన్యకుబ్జే తథా గౌరీ రంభా మలయ పర్వతే || 3**

**ఏకామ్రకే కీర్తిమతీ విశ్వా విశ్వేశ్వరీ తథా |**

**కర్ణికే పురుహస్తేతి కేదారే మార్గదాయికా || 4**

**నంద్యాహిమవతః పృష్ఠ గోకర్ణే భద్రకాళికా |**

స్థాణీశ్వరే భవానీ తు బిల్వకే బిల్వపత్రికా ||5

శ్రీశైలే మాధవీ దేవీ భద్రా భద్రేశ్వరీ తథా |

జయా వరాహశైలేతు కమలా కమలాలయే || 6

రుద్రకోట్యాం తు రుద్రాణీ కాళీ కాలంజరే తథా |

మహాలింగే తు కపిలా కర్కోటే మంగళేశ్వరీ || 7

శాలిగ్రామే మహాదేవీ శివలింగే జలప్రియా |

మాయాపుర్యాం కుమారీతు సంతానే లలితా తథా || 8

ఉత్పలాక్షీ సహస్రాక్షే హిరణ్యాక్షే మహోత్పలా |

గయాయాం మంగళా నామ విమలా పురుషోత్తమే ||9

విపాశాయా మమోఘాక్షీ పాటలా పుణ్యవర్ధనే |

నారాయణీ సుపార్శ్వే తు త్రికూటే భద్రసుందరీ || 10

విపులే విపులా నామ కల్యాణీ మలయాచలే |

కోటవీ కోటితీర్థేతు సుగంధా మాధవీ వనే ||11

కుబ్జామ్రకే త్రిసంధ్యా తు గంగాద్వారే హరిప్రియా |

శివకుండే శివానందా నందినీ దేవికా తటే || 12

రుక్మిణీ ద్వారవత్యాం తు రాధా బృందావనే తథా |

దేవకీ మధురాయాంతు పాతాళే పరమేశ్వరీ || 13

చిత్రకూటే తదా సీతా వింధ్యే వింధ్య నివాసినీ |

సహ్యాద్రే ఏక వీరా తు హరిశ్చంద్రే తు చంద్రికా || 14

రమణా రామతీర్ణేతు యమునాయాం మృగావతీ |

కరవీరే మహాలక్ష్మీ రమాదేవీ వినాయకే || 15

ఆరోగ్యా వైద్యనాథే తు మహాకాళే మహేశ్వరీ |

అభయా పుష్ప తీర్ణేతు అమృతా వింధ్య కందరే ||16

మాండవ్యే మాండవీ దేవీ స్వాహా మహేశ్వరే పురే |

వేగవే తు ప్రచండా2 థ చండికా మర కంటకే || 17

సోమేశ్వరే వరారోహా ప్రభాసే పుష్కరావతీ |

దేవమాతా సరస్వత్యాం పారావారే తటే స్థితా || 18

మహాలయే మహాపద్మా పయోష్ణ్యాం పింగళేశ్వరీ |

సింహికా కృతశౌచే తు కార్తికేయే తు శంకరీ || 19

ఉత్పలావరకే లోలా సుభద్రా సింధు సంగమే |

ఉమా సిద్ధవనే లక్ష్మీ రనంగా భరతా2_శ్రమే || 20

జాలంధరే విశ్వముఖీ తారా కిష్కింధ పర్వతే |

దేవదారు వనే పుష్టి ర్మేధా కాశ్మీర మండలే || 21

భీమా దేవీ హిమాద్రౌ చ తుష్టిర్విశ్వేశ్వరే తథా |

కపాలమోచనే శ్రద్ధా మాతా కాయా2_వరోహణే || 22

శంఖోద్ధారే ధ్వనిర్నామ ధృతిః పిండారకే తథా |

కాలా తు చంద్రభాగాయా మచ్ఛోదే సిద్ధిదాయినీ || 23

వేణాయామమృతా దేవీ బదర్యా మూర్వశీ తథా |

ఔషధీ చోత్తరకురౌ కుశద్వీపే కుశోదకా || 24

మన్మథా హేమకూటే తు కుముదే సత్యవాదినీ |
అశ్వత్తే వందనీయా తు నిధిర్వైశ్రవణా లయే || 25

గాయత్రీ వేదవదనే పార్వతీ శివసన్నిధౌ |
దేవలోకే తథేంద్రాణీ బ్రహ్మాస్యే తు సర్వసతీ ||26

సూర్యబింబే ప్రభానామ మాతృణాం వైష్ణవీ తథా |
అరుంధతీ సతీనాం తు రామాసు చ తిలోత్తమా ||27

చిత్తే బ్రహ్మకళా నామ శక్తిః సర్వశరీరిణామ్ |
ఏత దృష్ట్యామయా ప్రోక్తం నామా ష్టశతముత్తమమ్ || 28

అష్టోత్తరం చ తీర్థానాం శతమేతదుదాహృతమ్ |
యో జపేత్ శ్రణుయాద్వాపి సర్వపాపైః ప్రముచ్యతే || 29

షోడశ మహావిద్యాస్వరూపిణి శ్రీరాజరాజేశ్వరీదేవి. ఈ దేవి దివ్యవిభూతుల్ని వర్ణించే అష్టోత్తర శతనామస్తోత్రం బ్రహ్మయామళతంత్రం అనే గ్రంథంలో ఉంది. ఈ స్తోత్రాన్ని నిత్యం పారాయణ చేస్తే రాజరాజేశ్వరీదేవి అనుగ్రహం వల్ల సమస్త భోగభాగ్యాలూ లభిస్తాయి.

**ఓం త్రిపురా షోడశీ మాతా త్ర్యక్షరా త్రితయాత్రయా**

**సుందరీ సముఖీ సేవ్యా సామవేద పరాయణా 1**

**శారదా శబ్దనిలయా సాగరా సరిదమ్బరా**

**శుద్ధా శుద్ధతనః సాధ్వీ శివధ్యాన పరాయణా 2**

**స్వామినీ శంభువనితా శాంభవీ చ సరస్వతీ**

**సముద్రనిధినీ శీఘ్రగామినీ శీఘ్రసిద్ధిదా 3**

**సాధుసేవ్యా సాధుగమ్యా సాధుసంతుష్ట మానసా**

**ఖట్వాంగధారిణీ ఖర్వా ఖడ్గఖర్పరధారిణీ 4**

**షడ్వర్గ భావరహితా షడ్వర్గ పరిచారికా**

**షడ్వర్గా చ షడంగా చ షోఢా షోడశ వార్షికీ 5**

క్రతురూపా క్రతుమతీ ఋభుక్ష క్రతుమండితా

కవర్గాది పవర్గాంతా అంతస్థా అంతరూపిణీ 6

అకారాకార రహితా కాలమృత్యు జరాపహా

తన్వీ తత్త్వేశ్వరీ తారా త్రివర్షా జ్ఞాన రూపిణీ 7

కాలీ కరాలీ కామేశీ చ్ఛాయా సంజ్ఞాప్యరుధ్ధతీ

నిర్వికల్పా మహావేగా మహోత్సాహా మహోదరీ 8

మేధా బలాకా విమలా విమలజ్ఞానదాయినీ

గౌరీ వసుధ్ధరా గోపుత్రీ గవాంపతి నిషేవితా 9

భగాంగా భగరూపా చ భక్తి భావపరాయణా

ఛిన్నమస్తా మహాధూపా తథా ధూమ్రవిభూషణా 10

ధర్మకర్మాదిరహితా ధర్మ కర్మపరాయణా

సీతా మాతంగినీ మేధా మధుదైత్య వినాశినీ 11

భైరవీ భువనమాతా భయదా భవసున్దరీ

భావుకా బగలా కృత్యా బాలాత్రిపురసున్దరీ 12

రోహిణీ రేవతీ రమ్యా రమ్భా రావణవన్దితా

శతయజ్ఞమయీ సత్వా శతక్రతు వరప్రదా 13

శతచక్షాననా దేవీ సహస్రాదిత్య సన్నిభా

సోమసూర్యాగ్ని నయనా వ్యాఘ్ర చర్మామ్బరావృతా 14




**అరెస్టుధారిణీ మత్తా మదిరా మదిరేక్షణా**

## ఇతి తే కధితం గోప్యం నామ్నామష్టోత్తరం శతమ్ 15

### అష్టాదశ శక్తిపీఠాల ప్రయాణ మార్గాలు

**1. శ్రీశాంకరీదేవి :**

విజయవాడ నుండి చెన్నై చేరి అక్కడి నుండి విమానం ద్వారా శ్రీలంక చేరాలి. శ్రీలంకలోని ట్రింకోమలి సిటీలో శాంకరీదేవి ఆలయం ఉన్నది.

**2. శ్రీకామాక్షీదేవి :**

విజయవాడ నుండి చెన్నై చేరితే అక్కడికి సుమారు 90కి.మీ. దూరంలో, తిరుపతి నుంచి 70కి.మీ. దూరంలో కంచి క్షేత్రంలో కామాక్షీపీఠం ఉన్నది.

**3. శ్రీశృంఖలాదేవి :**

విజయవాడ నుండి కలకత్తా వరకు రైలు ద్వారా చేరితే అక్కడి నుండి గంగానది సాగర సంగమం చేసే గంగాసాగర్ ప్రాంతం వద్ద శృంఖలాదేవి ఆలయం ఉన్నది.

**4. శ్రీచాముండాదేవి :**

విజయవాడ నుండి మైసూర్ చేరాలి. మైసూర్ పట్టణంలోనే శ్రీ చాముండాదేవి ఆలయం ఉన్నది.

**5. శ్రీజోగులాంబాదేవి :**

విజయవాడ నుండి గుంటూరు, కర్నూలు మీదుగా కర్నూలు నుండి హైదరాబాద్ వెళ్ళే మార్గంలో తుంగభద్రానది ఒడ్డున అలంపురం క్షేత్రం ఉన్నది. బస్సు రైలు మార్గాల ద్వారా ఇక్కడికి చేరవచ్చు.

**6. శ్రీ భ్రమరాంబాదేవి :**

విజయవాడ నుండి గుంటూరు, డోర్నాల మీదుగా బస్సు మార్గం ద్వారా శ్రీశైల క్షేత్రానికి వెళ్ళవచ్చు. ఇక్కడే భ్రమరాంబా శక్తిపీఠం వున్నది.

**7. శ్రీమహాలక్ష్మీదేవి :**

విజయవాడ నుండి హైదరాబాద్ మీదుగా మహారాష్ట్రలోని కోల్హాపూర్ రైలు ద్వారా చేరవచ్చు. ఇక్కడే మహాలక్ష్మి పీఠం వున్నది.

**8. శ్రీఏకవీరాదేవి :**

విజయవాడ నుండి నిజామాబాద్, అదిలాబాద్ మీదుగా మహారాష్ట్రలోని నాందేడ్ చేరాలి. అక్కడి నుండి సుమారు 128కి.మీ. దూరంలో మాహుర్యం అనే ప్రాంతంలో ఏకవీరాదేవి పీఠం వున్నది.

**9. శ్రీమహాకాళీదేవి :**

విజయవాడ నుండి ఢిల్లీ రైలుమార్గంలో నాగపూర్ మీదుగా భోపాల్ చేరాలి. భోపాల్ కి 184కి.మీ. దూరంలో ఉజ్జయినీ క్షేత్రంలో మహాకాళీ పీఠం వున్నది.

**10. శ్రీపురుహూతికాదేవి :**

విజయవాడ నుండి ఏలూరు, రాజమండ్రి మీదుగా సామర్లకోట చేరాలి. అక్కడికి దగ్గరలోని పిఠాపురంలో పురుహూతికా పీఠం ఉన్నది. రైలు-బస్సు ద్వారా చేరవచ్చు.

**11. శ్రీగిరిజాదేవి :**

విజయవాడ నుండి విశాఖపట్నం మీదుగా ఒరిస్సాలోని కటక్ చేరాలి. అక్కడికి దగ్గరలో జాజ్ పూర్ ప్రాంతంలో గిరిజాదేవి శక్తిపీఠం ఉన్నది.

**12. శ్రీ మాణిక్యాదేవి :**

విజయవాడ నుండి రాజమండ్రి మీదుగా కాకినాడ చేరాలి. అక్కడి నుండి ద్రాక్షారామం వెళ్ళవచ్చు. లేదా విజయవాడ నుండి రామచంద్రపురం బస్సుద్వారా వెళ్ళాలి. అక్కడికి 12కి.మీ. దూరంలో మాణిక్యాదేవి పీఠం ఉన్నది.

**13. శ్రీకామరూపాదేవి :**

విజయవాడ నుండి విశాఖ కలకత్తా మీదుగా రైలుద్వారా అస్సాంలోని గౌహతీ చేరవచ్చు. గౌహతి నగరంలో నీలాచల పర్వతం మీద శ్రీకామాఖ్యపీఠం ఉన్నది.

**14. శ్రీమాధవేశ్వరీదేవి :**

విజయవాడ నుండి నాగపూర్, ఇటార్సీ మీదుగా రైలుద్వారా అలహాబాద్ చేరవచ్చు. ఇక్కడే గంగాతీరంలో శ్రీమాధవేశ్వరీ పీఠం ఉన్నది.

**15. శ్రీవైష్ణవీదేవి :**

విజయవాడ నుండి ఢిల్లీ మీదుగా రైలు ద్వారా పఠాన్ కోట స్టేషన్ చేరాలి. అక్కడికి దగ్గరలో జోగేంద్రనగర్ ప్రాంతంలో కాలంధర్ పర్వతం మీద జ్వాలాముఖీ వైష్ణవీ పీఠం ఉన్నది.

**16. శ్రీ మంగళ గౌరీదేవి :**

విజయవాడ నుండి రైలుద్వారా ఇటార్సీ, అలహాబాద్ మీదుగా గయా క్షేత్రానికి వెళ్ళవచ్చు. ఇక్కడే మంగళగౌరీ దేవి పీఠం వున్నది.

**17. శ్రీవిశాలాక్షీదేవి :**

విజయవాడ నుండి ఇటార్సీ అలహాబాద్ మీదుగా రైలు ద్వారా వారణాసి క్షేత్రానికి వెళ్ళవచ్చు. ఇక్కడ శ్రీవిశాలాక్షీదేవి పీఠం ఉన్నది.

**18. శ్రీ సరస్వతీదేవి :**

విజయవాడ నుండి రైలుమార్గం ద్వారా జమ్ము నగరానికి చేరాలి. అక్కడి నుంచి బస్సుద్వారా శ్రీనగర్ చేరితే అక్కడికి సుమారు 80కి.మీ. దూరంలో శ్రీ సరస్వతీదేవి పీఠం ఉన్నది. కొందరు ఈ పీఠం పాక్ ఆక్రమిత కాశ్మీర్ లో వుందంటున్నారు.